డా. బూదరాజు రాధాకృష్ణగారికి
గౌరవపూర్వకంగా

[illegible]

అబ్బూరి రామకృష్ణరావు

# ఊహాగానము

## ఇతర కృతులు

అబ్బూరి ట్రస్ట్

UHAGANAMU, ITARA KRITULU
by Abburi Ramakrishna Rau

ప్రథమ ముద్రణ 1973
ద్వితీయ ముద్రణ 1994

ముఖచిత్రం అ. పైడిరాజు
కవర్ డిజైన్ శీలా వీర్రాజు

మూల్యం రూ 45/-


బి 4/ఎఫ్ 4 బాగ్‌లింగంపల్లి
హైదరాబాదు-500 044

ప్రతులకు

1 అబ్బూరి ట్రస్ట్.
2. విశాలాంధ్ర బుక్ హౌస్ హైదరాబాదు
3. నవోదయ పబ్లిషర్స్, విజయవాడ.
4. నవోదయ బుక్‌హౌస్, హైదరాబాదు

ముద్రణ
శివాజీ ప్రెస్
4-4-53, గంజ్‌బజారు, సికింద్రాబాదు-500 003.

# పరిచయం

అబ్బూరి రామకృష్ణరావుగారి అరవయ్యేళ్ళ సాహితీవ్యాసంగంలో సార భూతమైన కవితాస్రవంతికి ఈ సంపుటం అక్షర స్వరూపం ఇదైనా సమగ్రం కాదు నిజానికి ఇది ఏనాడో వెలుగు చూడవలసింది. శ్రీయుతులు మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు అబ్బూరివారి కృతులన్నిటినీ ప్రచురించాలని ప్రయత్నించినా సాధ్యపడలేదు. నేటికి మా అదృష్టవిశేషం వల్ల ఈ అవకాశం లభించింది ఇప్పటికి లభించిన ముద్రిత పద్యగేయకృతులు చాలావరకు ఇందులో చేరినా మరి కొన్ని కృతులూ, దేశవ్యాప్తంగా వినిపించే వారి చాటువులూ ఇందులో చేరలేదు నదీసుందరివంటి ప్రశస్తరచనల్లోని పద్యగేయ భాగాలు మాత్రమే ఇందులో చేరాయి. 108 పద్యాల జలాంజలి ప్రథమార్ధం (అవి పద్యాలు) మాత్రమే ముద్రితమయింది, రెండో భాగం దొరకలేదు. ముద్రణ పూర్తవుతుండగా ఏనాడో జలసూత్రం వారు రాసిన ఒక లేఖ దొరికింది. అందులో మరి రెండు 'జలాంజలి'లోని పద్యాలు దొరికాయి అవి ఇవి (వీటిలో రెండోది చివరి పద్యం)

> ''చివురించెన్ విమలప్రభాతయువతీశృంగారశీలమ్ము ప్రా
> గవనీప్రాంతవనాంతరస్థలుల కల్యాణోత్సవమ్మై, ప్రభా
> ర్ణవమధ్యమ్మున మజ్జనమ్ముల నిమగ్నమ్మయ్యె సర్వస్వ మ
> ల్లవివో సూర్యఘృణీనవీనవిజయవ్యామోహపుం ధోరణుల్

> ''తలిరుల మవ్వమేని వెనుదన్నెడు ప్రేమలతావిశేషకో
> మలత యొనర్చు చిత్రమహిమమ్ము జగమ్మె యెఱుంగుగాత, కం
> దళితవిశుద్ధభక్తికలనమ్మున లీనము నొందుగాత, ని
> ర్మలహృదయమ్ముతోడ మన మంగళగీతము నాలకించుతన్"

'త్రిశంకు' కావ్యమే ఒక పద్యం మినహాగా అదృశ్యమయింది. అముద్రిత రచన లనేకం చేరలేదు దొరికినంతలో ఆయాకావ్యాలూ ఖండికలూ అనూదిత గేయాలూ

కాలనిర్దేశంతో ఇక్కడ కనిపిస్తాయి కొన్ని సందర్భాల్లో రచనా కాలానికీ ముద్రణ కాలానికీ దశాబ్దాల భేదం కనిపిస్తుంది (ముద్రణకాలాన్ని కుండలీకరించి రచనా కాలాన్ని ముందు నిర్దేశించి ఇచ్చిన ఈ పట్టిక ఈ విషయాన్ని స్పష్టీకరిస్తుంది). జలాంజలి, 1909 (1914), మల్లికాంబ, 1913 (1915), ఊహాగానము, 1916-17 (1918), నదీసుందరి, 1923 (1931), ఎట్టిగన్నెరు, 1924 (1925), మందారశిశువు, 1923-24 (1941), వైతాళికులు, మహోదయము అనే సంకలన గ్రంథాల్లో చేరినవి, 1923-24 (1946) రవీంద్ర నాటకానువాదాల విషయంలో రచనాకాలాన్నే (1962) నిర్దేశించాం, ప్రచురణకాలం 1969 అలాగే ఇంతకు ముందు ప్రచురితం కానివాటి విషయంలో కూడా మరి తొమ్మిది ఖండికల ముద్రణకాలనిర్దేశం విషయసూచికలో మాత్రమే కనిపిస్తుంది. అవి 'నదీసుందరి' లోనివి మూడు (రసపిపాసి, సంధ్యాకామిని, కావేరి దేవేరి), 'వైతాళికుల'లో అచ్చైనవి రెండు (వర్షాగమము, ద్రాక్షావీధి), 'మహోదయము'లో ముద్రితమైనవి నాలుగు (నీ మహిమార్ణవంబున, అతిథి, సాయంతనము, చారుకుసుమాళి)

ఈ పరిస్థితికి అబ్బూరివారి చిత్తసంస్కారాలే ప్రధానకారణాలు కవితా నాటకరంగాలకు వారు చేసిన సేవకన్నా వారి వ్యక్తిత్వమే మహోదాత్తమంటారు శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు అబ్బూరివారి జీవితవృత్తాన్ని కావ్య జీవితంలో సమన్వయించి పరిశీలిస్తేగాని ఆ మాట ఎంత యథార్థమో లోకానికి తెలియదు

1896లో జన్మించిన రామకృష్ణరావుగారు 1909 నాటికే- అయిదో ఫారం చదువుతుండగానే- 'జలాంజలి' రచించారు ఆ తరవాత అయిదేళ్ళకుగాని అది ప్రచురితంకాలేదు ప్రచురణ కాలానికి వారు బందరు నోబుల్ కళాశాలలో ఇంటర్మీడియట్ విద్యార్థిగా ఉండేవారు అప్పటికే భోగరాజు పట్టాభి సీతారామయ్య గారివంటి దేశనాయకులతోను, తిరుపతి వేంకటకవులవంటి కవినాయకులతోను వారికి పరిచయభాగ్యం కలిగింది వారి వారి ప్రభావాలు నూత్న యౌవనంలో వున్న అబ్బూరివారిపై చెరిగిపోని ముద్రవేశాయి విద్యార్థిగా ఉండగా ప్రచురించిన తొట్టతొలి విషాదకావ్యం 'మల్లికాంబ' వారి 'కిశోరప్రేమానుభవఫలిత' మంటారు డా శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఆ తరవాత నాలుగేళ్ళు వారు ప్రవాసాంధ్రులు

తండ్రి లక్ష్మీనృసింహశాస్త్రిగారు సంస్కృత విద్వాంసులు కుటుంబ సంస్కార ఫలితంగానేమో రామకృష్ణరావుగారు మైసూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం చేశారు అక్కడ వారికి అపూర్వ సజ్జనసాంగత్యంకూడా లభించింది శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సహాధ్యాయులైనారు డాక్టర్ సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి సాహచర్యం కూడా అక్కడే లభించింది పార్శ్వ గ్రంథపఠనం ఒక ఎత్తయితే ఈ ముగ్గురి భారత భారతీ పారాయణం మరో ఎత్తయింది ఆ కాలంలో రచనాభ్యసనాలు రెండూ జంటగా సాగిపోయినయ్.

ఆధునిక కాల్పనికోద్యమఫలమైన భావకవితారీతులు పూర్తిగా 'రూపు కట్టకముందే' అబ్బూరివారి 'మల్లికాంబ' ఆ ధోరణికి గౌరవం తెచ్చిపెట్టింది; అభినవకవితామూలపురుషు లిద్దరిలో వీరొకరు

1917-19 మధ్యకాలం గురుదేవులు రవీంద్రనాథ ఠాకుర్ సన్నిధిలో శాంతినికేతనంలో గడిచిపోయింది వంగభాషా సాహిత్యాధ్యయనంతో బాటు అరవిందరవీంద్రుల బహుముఖశేముషీవిశేషాన్ని స్వాయత్తంచేసుకొనే ప్రయత్నం కూడా సాగింది అశేషభారతీయకవులతో దేశభక్తులతో వారి పరిచయ స్నేహాలు అక్కడే పల్లవించాయి ఆనాటిదే 'ఊహాగానం' 'నిరాడంబరతాభావనాబలాలు' రెండూ 'సమపాలున కలిసి బలిసి'న మహారచన అంటారు దీన్ని విద్వాన్ విశ్వం గారు 'అంతర్ప్రేరణ'కు ఈ కావ్యం మధురనిదర్శనమనిగూడా ఆయనే అన్నారు. ఆ కావ్యంలోని 'అప్రాప్త మనోహరికి' అనే ఖండకావ్యం తరవాతితరం భావకవు లెందరికో 'మూలవిరాట్టు' అంటారు శ్రీపాదవారు

ఆ కాలంలోనే ఆధునికాంధ్ర కవితారీతులకు ప్రచార గౌరవాలు సంత రించాలనే సత్సంకల్పంతో 'ఆంధ్రపత్రిక' వారికి నచ్చజెప్పి 'సారస్వతానుబంధం' పెట్టించారు అబ్బూరివారు ఈ శీర్షిక కింద అచ్చయిన మొట్టమొదటి వ్యాసం వారి 'అభినవకవితా ప్రశంస'

అబ్బూరివారు 1919లో ఆంధ్రదేశానికి తిరిగివచ్చేసరికి స్వరాజ్యోద్యమం ముమ్మరంగా సాగుతున్నది ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ప్రధా నాంతేవాసిగా తీరాంధ్రదేశంలో జరిగిన స్వాతంత్ర్యోద్యమంలో వారు పాలుపంచు

కొన్నారు. ఆ కాలంలో రాసిన 'జలియన్‌వాలాబాగ్' బుర్రకథ బహుళ ప్రచారం పొందింది అప్పటి ప్రభుత్వం నిషేధించిన ఆ రచనను పునస్సంపాదించే ప్రయత్నాలింకా పూర్తిగా నెరవేరలేదు 1923-24 ప్రాంతంలో 'కృష్ణాపత్రిక'లో 'రసమంజరి' అనే అనుబంధం పెట్టించినవారు కూడా అబ్బూరి వారే ఆ శీర్షిక లోని మొదటి రచన వారి 'సూర్యరాజు కథలు' ఇవి పదిహేను పదహారు చిన్న కథలు ప్రచురితమైనాయి కథానికా సాహిత్యం ఆనాటికింకా సాహితీ ప్రతిష్ఠ సంపాదించుకోలేదు పూర్తిగా

ఆ కాలంలోనే మైసూరులో ఉండగా బీజావాపనం జరిగిన కమనీయ కావ్యం 'నదీసుందరి' రూపు ధరించింది 'వైతాళికులు, వెన్నెల కుప్పలు, మహోదయము' వంటి కవితా సంకలనాల్లో ప్రచురితమైన వారి కావ్యఖండికల్లో చాలా భాగం అప్పుడే రచితమైనాయి ఈ కావ్యాల్లోని శిల్పం వారిని ఆచార్య పి టి రాజు గారు ఆంగ్లమహాకవి కీట్స్‌తో పోల్చేటట్లు చేసింది కపిలకాశీపతిగారు ఆ శిల్పాన్ని గుర్తించే 'అబ్బూరి మాటలు రత్నాలులాగ పొదుగుతాడు అతడు శిల్పి' అన్నారు 'తెలుగు పదముల మందగమనముతో శ్రోణీభారాదలసగమనయైన పలుకుబడి'తో వాటి రచన సాగిందంటారు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు వారు 'సహజకవు' లంటారు మనూనాగారు 'శేముషీపల్లవితమ్ములౌ సరళభావములు' కావాలన్నా, 'వైజ్ఞానికసాధుభాషణములు' కావాలన్నా, 'కనబడని భావముల సువాసనల' కోసమైనా చదివి తీరవలసిన కావ్యరత్నఖండాలివి వారే 1924లో 'మంగళ సూత్రం' అనే అపరాధ పరిశోధక నవల రాశారంటే నమ్మటం కష్టమే !

1926లో ఆంధ్రవిశ్వకళాపరిషత్ స్థాపితంకాగానే మొట్టమొదటి ఆంధ్రాధ్యాపకులుగా చేరినవారు అబ్బూరివారు. తరవాత అక్కడే గ్రంథాలయ నిర్వాహకులుగా ముప్పైనాలుగేళ్ళు పనిచేసి తాము చదివి ఎందరినో చదివించి వృద్ధికి తెచ్చారు. అప్పట్లో వారిదృష్టి నాటకరంగం మీదికి మళ్ళింది కన్యాశుల్కానికి అద్భుతమైన వ్యాఖ్యానంచేశారు ప్రదర్శింపజేశారు

1936లో మున్షీ ప్రేమచంద్ అధ్యక్షతన లక్నోలో జరిగిన అఖిలభారత అభ్యుదయ రచయితల ప్రథమ సదస్సులో సజ్జాద్ జహీర్, హీరేన్ ముఖర్జీలతో బాటు పాల్గొని ఆ సంఘస్థాపకుల్లో ఒకరైనారు. అఖిలభారత అభ్యుదయ రచయితల

సంఘం ప్రారంభించిన 'ఇండియన్ లిటరేచర్' అనే పత్రిక సంపాదక వర్గంలో ఒకరయినారు 1936లో 'నాట్యగోష్ఠి'ని స్థాపించారు ప్రాచ్య పాశ్చాత్య నాటక రచనా ప్రదర్శనల్లోని సంప్రదాయ వైభవాన్నీ సజీవశక్తినీ సమన్వయించి ప్రయోగించటానికి తమ యావచ్ఛక్తినీ ధారపోశారు. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో 'నటాలి' అనే నటీనటబృందంతో తాము ప్రదర్శనయోగ్యాలుగా సంత రించిన 'కన్యాశుల్కం', 'ధాన్యలక్ష్మి' రూపకాలను ఆంధ్రదేశమంతా పర్యటించి ప్రయోగించారు స్వయంనటులై రామప్పంతులు పాత్రకు జీవంపోశారు ఎందరో వర్ధిష్ణువులను చేరదీసి పేరుకు తెచ్చారు 1939లో ఎం.ఎన్.రాయ్, తర్కతీర్థ లక్ష్మణశాస్త్రి జోషీ, సచ్చిదానందవాత్స్యాయనులతో కలిసి Indian Renaissance Association స్థాపించి భారతీయ సాహితీపునరుజ్జీవనానికి దారితీశారు.

1954లో 'కవిత'లో ప్రచురితమైన వారి రచనలు వెలుగుచూశాయి. వారి రచనాధోరణి 'శతసహస్రయోజన సంచారకుతూహల చంచల భావనా కురంగ మెక్కి' విహరించింది పరిపక్వమైన లోకానుభవ శాస్త్రజ్ఞానాలు 'అజ్ఞాతాజ్ఞేయాలకు అజ్ఞానంతో నేస్తం' కలిగినందుకు తపించిపోయాయి, స్వస్థానవేషభాషాభిమానాలనే గాని సార్వకాలికమానవతామహాన్నత్యాన్ని గుర్తించలేని సాహితీపరులను 'జన్మ భూమి జననికాదు, సామాన్యసుమా అయమ, వసుమతియగు నామెకొరకు, వల్లభు లెందరు పెనగిరి?' అని హెచ్చరింపజేశాయి, 'తారకు తారకు దూరం, నిరాధార సంచారం' అని గుర్తింపజేశాయి

అబ్బూరివారి కవితాశక్తులను అనేకులు అనేకవిధాలుగా వర్ణించారు. వారి తేటగీతులు 'ముద్దులమూట' లంటారు మనూనాగారు ద్విపదరచనలో వారు సిద్ధ హస్తులంటారు శ్రీపాదవారు "ముత్యాలసరం అన్నమాటేమిటి, ఏ ఛందమయినా వీరు చెప్పినట్లు వింటుంది" అంటాడు శ్రీశ్రీ, కపిల కాశీపతిగారు వారిని'శిల్పి'గా చిత్రిస్తే, శ్రీశ్రీ వీరిని గొప్ప technicianగా భావించాడు. వంగ సంస్కృత సాహితీ పరిచయ మున్నవారికిగాని వారి ఉక్తివైచిత్రి సుబోధమనోహరం కాదు.

అబ్బూరివారిమీద అభిమానులుచేసే అభియోగాలు చాలా ఉన్నాయి 'ఎంత వ్రాయగలిగిన శక్తి వుందో అంత తక్కువ వ్రాసినాడు' అని కపిల కాశీపతి గారు నొచ్చుకొన్నారు అందుకు వారి 'నిస్పృహ', 'ప్రాలుమాలిక', 'వైముఖ్యం',

'నిర్లిప్తత' వంటివి అనేకకారణా లున్నాయంటారు ఒకటి మటుకు సత్యం ప్రచార పరాయణమైన బెర్నార్డ్‌షా యుగంలో, సంఘబలంమీద నడుస్తున్న ఆధునికాంధ్ర సాహితీప్రపంచంలో అబ్బూరివారు anachronism వంటివారు సాహితీసమితే కాదు- ఏ సాహిత్యసంస్థలోనూ ఆయన సభ్యత్వం పొందదలచలేదు అందువల్లనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి సంస్థాపకసభ్యులైనా ఆ సంస్థనుంచికూడా తప్పు కున్నారు. స్వీయరచనలనే పోగొట్టుకున్నారు ! ఈ సంపుటాన్ని ఈ రూపంలో ప్రచురించటానికే ఎన్నో ప్రయాసలు పడవలసివచ్చింది కవితలో లాగే నిత్య జీవితంలోనూ హుందాతనం పోగొట్టుకోలేని వ్యక్తికి, కీర్తికామనగాని సంపాదన తృష్ణగాని లేని వ్యక్తికి రావలసినంత సారస్వతప్రతిష్ఠ రాలేదంటే సమకాలిక సమాజవ్యవస్థ దుస్థితి ఏమో ద్యోతకం కాకమానదు

అబ్బూరివారి వ్యక్తిత్వంలోని అసాధారణత్వమే బహుశా ఈ స్థితికి ప్రధాన హేతు వనిపిస్తుంది భారతదేశంలో తలయెత్తిన ప్రతి రాజకీయోద్యమంతోను, సాహిత్యోద్యమంతోను, సామాజికోద్యమంతోను వారికి అంతో ఇంతో ప్రత్యక్షసంబంధ ముంది అరవిందుడివంటి విప్లవకారులనుంచి ఎం ఎన్ రాయ్ వంటి మేధావుల వరకూ సనాతనసంస్కృత విద్వత్సభలనుంచి అభ్యుదయరచయితల మహాసభల వరకూ, సాంప్రదాయికకావ్యకర్తలనుంచి దిగంబరకవులవరకూ వారికి నిషిద్ధమేదీ లేదు ఆంధ్రేతర రచయితలతో విద్వాంసులతో కళాకారులతో వారంత పరిచయ స్నేహాలున్న మరో ఆంధ్రసాహితీపరుడు కనిపించడు. మానవతకు ఇచ్చిన విలువను వారు మానవదౌర్బల్యాలకు ఇవ్వలేదు ఒకరి ప్రతిభను గుర్తించి ప్రోత్సహించగల శక్తి వారికి ఆజన్మసిద్ధం జీవితంలో ఎన్నో కష్టనష్టా లనుభవించి నమ్మి మోసపోయినా నవ్వుకోగల నిండుమనిషి మనీషి లోకాన్నీ లోకులనూ నిర్మోహ సమ్యగ్దృష్టితో చూడగలరు నిర్వికారంగా నిర్మమంగా తృణీకరించనూ గలరు అనేకోద్యమాల 'అంతస్తత్వం ఎరిగినవా'రని సుప్రసన్న గా రంటారు ఆ 'ఎరుక' వల్లనే ఆయన వ్యక్తిత్వానికీ రచనలకూ నిండుదనం వచ్చింది

కపిల కాశీపతిగారూ సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారూ చెప్పినట్లు 'అబ్బూరి వారితో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్' ఆయన చమత్కారి చెప్పిన 'జోక్' చెప్పకుండా చెబుతూ చమత్కారబాణాలను పుంఖానుపుంఖంగా ప్రయోగించగలరు.

వారి కవితాదృష్టిలో భాషాదృష్టిలో జీవన దృక్పథంలో వచ్చిన మార్పులను ఈ సంపుటిలో గుర్తించవచ్చు. రామకృష్ణరావుగారిని చూసినప్పుడల్లా అక్కిరాజు ఉమాకాంతం గారు ఎందుకో జ్ఞాపకం వస్తుంటారు పదునైన ఊహలో, శబలభావనలో, విస్పష్టవిషయ వ్యక్తీకరణలో వీరిద్దరికి సాజాత్యం ఉందనిపిస్తుంది శాస్త్రీయ చారిత్రక దర్శనజ్ఞానంకూడా మరో సాదృశ్యం కావచ్చు అబ్బూరి వ్యక్తిత్వంలో నిరీక్షణ విచక్షణల పాలు ఎక్కువ. అటువంటి వ్యక్తి బళ్ళకెత్తించవలసినన్ని రచనలు చేయటం సాగనిపని రాసినంతలో వారిది సూత్రరచన వంటిది. గంటపైన చాలు !

ఈ సంపుటిని ప్రచురించటంలో- ముఖ్యంగా అబ్బూరివారి రచనలు లభింపజేయటంలో- తోడ్పడినవారిలో ముఖ్యులు నెల్లూరు వాస్తవ్యులు శ్రీ నేలనూతుల శ్రీకృష్ణమూర్తిగారు, విశాఖవాసులు మసూనాగారు, శ్రీ పురిపండా అప్పలస్వామి గారు, వీరందరికీ మా కృతజ్ఞతలు రవీంద్రనాటకానువాదాలనుంచి గేయభాగాలను ప్రచురించటానికి అనుమతించిన కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శులు శ్రీ ప్రభాకర మాచ్వేగారికి మేం ఋణపడివున్నాం 1952లో ప్రసిద్ధచిత్రకారులు శ్రీ అ పైడిరాజుగారు చిత్రించిన చిత్రం వాడుకున్నాం వారికి మా కృతజ్ఞతలు.

అబ్బూరివారి ఇతర రచనలు కూడా త్వరలో వెలుగచూస్తాయని ఆశిస్తున్నాం

బూదరాజు రాధాకృష్ణ
ఏల్చూరి సుబ్రహ్మణ్యం

# విషయసూచిక

నేనే కాదు సమస్త భారత వతియున్

నిర్వేద భారమ్ముచే

నానా భంగుల లాలనీయగతులన్

నాగవవే పాదులన్

నానీకమ్ముల లోన లోన నాక వో

వోకారము వ్యాప్తమై

శ్రీ నారాయణ పాదపద్మ రజం

శ్లేషమ్ము గాంక్షించెదన్.

అబ్బూరి రామకృష్ణారావు.

ముదివడ, కంపలందు విడివోయెడు ప్రావరణంబు, కాళ్లు వీ
ద్వడ, శిథిలంబులౌ బరడు పాదుకలం దరియించి, కాలి వో
యెడు నెదురెండ నొక్క సెలయేటి తటంబున నేఁగుచుండె నె
వ్వఁడొ యుపకుం డొకండు పరివర్జితదేహసుఖాభిలాషియై

అరిగె యరిగి ఝరీపరిసరమునందుఁ
గానవచ్చెడు నొక్క యుద్యానమునకు
నడచుచుండె నధికగమనంబుపెలస
నెఱ్ఱవారిన పదముల నీడ్చికొనుచు

ఘర్మ సలిలంబు కాల్వలఁ గాఱ ముంగు
రులు నొసటిపైనిఁ బట్టుకుచ్చుల విధానఁ
జలనముం బొంద జీర్ణవస్త్రముఁతోడ
నతని యాకృతియౌ మనోహరము కరము

వయసు పదునెన్మిదేడులే యయిన మోము
వనటచే వాడి యేదియో వలయుననెడి
చాడ్పునం దోఁచు నంబరాచ్ఛాదితాంగ
ములకు నితరమ్ములకు భేదములు స్ఫురించు

కొండొక నేలయేఁగి యటకుం గడు చేరువ నున్నదే మునీం
ద్రుండు వసించు శాల యని తోఁచ వ్యథాక్షర ముబ్బరింప నా
ర్తుండయి నాదు కష్టపు గతుల్ తుదముట్టునె నాదు కోరికల్
పండునె దైవమా ! యని యలంగి యెలుంగున నేడ్చి మూర్ఛిలెన్

పొరలివచ్చునంతటి దుఃఖమునకు నేమి
కారణమొ ? యిక్కటుల దరిఁ గాంచుటేమొ ?
ఈప్సితమ్ములు ఫలియించుటేమొ ? మునుల
పర్ణశాలలతో నేమి బాంధవంబొ ?

సనిచెడ గృహసుఖముల వె
క్కసముగ గణియించి ఘోరకాంతారమునన్
వసియించెడు తాపసికై
వ్యసనమువడు నెంత తీవ్రవైరాగ్యమహో

మూర్ఛతలఁగఁగ మనలోకమునకు వచ్చి
యశ్రుకణములు మంచిముత్యములరీతి
రాల నిటువల్కె మధురస్వరమ్ముతోడఁ
బొరలివచ్చెడు దుఃఖ మాపుకొనలేక

అమ్మా ! కాళీ ! త్వదీయపాదయుగ మభ్యర్చించి ప్రార్థింతు నీ
సమ్మానాంబువు లించుకంత పయిపైఁ జల్లన్ వలెన్, దుఃఖముల్
రెమ్మల్ దాలిచి సంతతంబు ననుఁ గారింపన్ మొదల్పెట్టె సౌ
ఖ్యమ్మున్ శాంతియుఁ గూర్చుతల్లి ! దయరాదా ? దీనుఁడ న్నాపయిన్

ఆశ్రమాభిముఖుండయి యంత రామ!
రామ! యని లేవఁబోయి దౌర్బల్యమునను
చరణముల నెత్తగాలేక చదికిలఁబడి
పూర్వవిధినెంచి యిటు దలపోయఁదొడఁగె

ఆనాటి రాత్రి తాపసి
రానేల? విషాదసాగరమ్మున నన్నున్
బోనేల విడిచి? భక్తుడఁ
గానో? నన్ బ్రోవకుంటఁ గారణమేమో?

నాలువు మాసముల్ గడచె నా తలిదండ్రుల వీడి పాడుబా
నేలల నేఁగియేఁగి తపనీయమహాతపమందు మాఁడి యే
వేళ సుషుప్తి తిండియు లభింపక యమ్మునిఁ గోరి కానకున్
బాలయి నేఁడు ప్రాణములఁ బాపుకొనంగ విధాత వ్రాసెనే?

తూలె సుఖోపభోగనియతుల్ పరమాశయపోషితమ్ములై
యే లవణానుషంగము లభించునొ? యంచు తలంపు నింపు నా
శాలతలెల్ల పూర్ణనిరసత్వమునొందె, మనోగతుల్ దురం
తాలసశోభ లయ్యె నకటా! వికలాకలనాతిసాంద్రతన్

ఈడునఁ బెద్దవయ్యుఁ బరమేశ్వరదివ్యపదాంబుజంబులం
జూడగలేవు! దప్పికకు క్షుత్పరిపీడన కంగలార్తు వో
పాడుశరీరమా! యిపుడుఁ బాయఁగ రోయనుగాని యమ్మునిం
గూడ నసంభవమ్మగుటకు న్విలపింతు వియోగవేదనన్

అని స్వీయోదంతనివే
దనరచనాపారవశ్యతన్ బడియుండన్
మునిపర్ణశాల నొక జ
వ్వను(డాకాలమున సంధ్యవార్ప(గడ(గుచున్

అనలము(గ్రక్కు-చుండెడు విషాహిశిరమ్ము( బదాంతఘట్టన
మ్మున బొలియించుచున్నగవుమోమున( బిల్లన(గ్రోవి నూ(దు కృ
ష్ణుని పటమొండు కట్టెదుట శోభిల( పీఠముపైన నుంచి నూ
తనసుమనోదళంబుల( బదంపడి పూజయొనర్ప( బోవుచున్

దైవమా! యను గద్గదారావ మతని
కర్ణముల సో(కె, నెమ్మేను( గంపమొంద
నులికిపడి లేచి ధ్వని యెటనుండి వచ్చె
నటకు( బరువెత్తె( దగు సహాయమ్మొనర్ప

గమనాయాసభరమ్మునం గనలి యంగ్రవ్రాత మెండం గృశిం
చు మృణాళాంకురశంక దో(ప, వికలాసుండైన చందాన, దే
హము నిశ్చేష్టితమై స్ఫురింప నవదీవ్యత్తేజసంవ్యాప్తనే
త్రముల న్మూసి పరున్నవాని( గని చేరంబోయి యాసీను(డై

సోదరా! యని సానుతాపోదయు(డయి
పిలిచిపిలిచి యెంతకును మార్పలుకకున్న
చెంత( బ్రవహించుచున్న కుల్యాంతరసలి
లమ్మునన్ మోము ప్రక్షాళనమ్ము( జేసె

అమవసనిశీథమున నాకసమునుండి
తొంగి చూచెడు రిక్కలభంగిఁ గనులఁ
దెఱచుచున్ మూయుచున్ మందదృష్టి నతఁడు
ఋషికుమారునిఁ గెలన నీక్షించెఁ బూర్వ
పరిచయవిశేషవిదుఁడైన భాతి నంత

చిరకాలవియోగార్తి
స్ఫురణము, నవసంగమప్రపూర్ణోదయమున్
పరిగొన మురళీ ! యని గ
గ్గురుపాటునఁ బిలిచె మరులుగొలుపు పలుకులన్

విస్మయపరీతమానసుఁడై, స్మరించి
పల్లవితపూర్వపరిచయభావసమితి
హృదయమున సందడింపఁగ ఋషికుమారుఁ
డితఁడె బాల్యంపు హితుఁడు గౌరీశుఁ డనుచు

దేహదౌర్బల్యమునఁ బ్రజవర్తిల్లువాని
లేవఁగాఁదీసి తోడ్కొని పోవుచుండె
మురళి, పరిగొనివచ్చు సంజరపుఁదెరలు
సుఖసముద్రాంతరమ్మున సొగయఁజేయ

ఆశ్రమముఁజేరి తత్కుటీరాంతరమున
నొక్క కృష్ణాజినమునఁ గూర్చుండఁ బెట్టె
ద్వారబంధమ్ముదరి సమీపప్రదేశ
ప్రకృతిసారస్యదర్శనార్థంబొ యేమొ ?

అలరులు సంచరింప మలయానిలబాంధవమంది లేఁతయా
కులపయి వార్నిధి స్నగముఁగ్రుంకిన వేఁడివెలుంగు దీధితుల్
తళతళలాడ నాల్గుకడల న్నెలకొన్న లతాళి వింత రం
గులఁ బొడసూప నేత్రములకున్ పరితోషద మవ్వనంబహా

కొలఁకులఁ ద్రావి శాద్వలనికుంజమునందున మేసి లేడి గుం
పులు రుచులూరు నిండు కడుపుల్ చెలువార విహారవాంఛచేఁ
గులుకుచు వోవుచుండు నటకున్ స్వగృహమ్ముల కేఁగు రీతి భీ
తిలక, విచిత్రముల్గద యతిప్రవరుల్ రచియించు స్నేహముల్

జంతుసంతానమును మనుష్యప్రతతియు
ప్రణయబంధానుబద్ధత మనుట యెట్లొ
గోచరమ్మగు మృగములఁ గోసి తినెడు
వారలకుఁ గూడ ఋషుల కుటీరములను

కడలల్లికొని సహకారభూజమ్ములఁ
బ్రాఁకు మవ్వంపు లవంగలతలు
గుత్తులై గాలి కూఁగుచును దింపులువోయి
తెమలు పచ్చని యింగుదీఫలములు
వింతయౌ పరిమళవృష్టిఁ బైపయిఁజల్లి
యెగఁ గొట్టు నీవారతృణగణమ్ము
కెంపులంబోలు రక్తిమఁ గల్గి కంచెలం
గ్రిక్కిరిసిన గురిగింజ చెండ్లు

స్వీయసౌందర్యముం బ్రదర్శించి వొలయ
వనముఁగాక యడవిఁగాక యెనయుచుండె
వర్ణనాతీతమైన శోభలఁ బెనంగి
యందమైన తీవెలయింటి యావరణము

అచటి ప్రవిమల స్వేచ్ఛావిహారసుఖము
దొరయు శ్రీకృష్ణ భక్తిమాధుర్యగరిమ
విషయవస్తుదుర్వాసనాభిరతిఁ జంపి
యాత్మలంజేర్చు నప్పరమాత్మ మ్రోల

నిఖిలజగము లదృశ్యుఁడై నిండియున్న
యీశ్వరుని ప్రకృతియె స్ఫురియింపఁజేయ
మనమున కతీతమయిన వర్ణనలఁ గూడి
ప్రకృతి పరమాత్మ యనెడి విభ్రమముఁ గొలుపు

శాంతవర్ణవిశాలశాలాంతరమున
పరచి భావుక కాషాయవసనములును
వ్రేలు కృష్ణాజినమ్ముల మాల లొకట
ప్రాఁబడి రజస్వలమ్ములై వరలుచుండె

శాంతమహాసముద్రసదృశంబయి బంధురతామసీ సమా
క్రాంతనిశీథినింబలె నిరస్త విహంగమకూజితావళీ
సంతతమై యటం బవనచాలనమైనను లేక వెల్గు నా
ప్రాంతవనంబు వింతయయి రాగిలుచుండె మనోహరమ్ముగన్

స్పర్శమాత్రానఁ గందు మవ్వమ్ము దేహ
మంతటన్ మొల్కలెత్తఁ దూఁగాడుచున్న
లలితనవమాలికాలతాలలన యొర్తు
సాఁగి చేసాఁచె నప్పర్ణశాల పయికి

అకృపణవిశేషనవపల్లవాభిరామ
మయి విశాలమౌ తత్కుటీప్రాంగణమున
నల్లిబిల్లిగఁ దీవ యొం డల్లియుండెఁ
దెలియ దద్దాని మధురాభిధేయమేమొ ?

తరళితమృదూపకంఠలతాప్రసూన
పరిమళభృతమ్ములగు శీతవాతములు చ
రించుచుండె నెల్లెడల నుద్ధృతి సమీప
తరుల రాయుచుఁ గంపితధ్వాన మెగయ

ఇతరు లెవ్వరులేరు గౌరీశుఁ డతని
హితుఁడు మురళియుఁ దక్క ప్రాకృతగభీర
వనరహస్యప్రదేశమందున నొకండుఁ
గాల మెట్టులఁ గడపెనోగాని మురళి

అగును జ్ఞప్తికి వచ్చె నిర్వ్యాజహృదయు
లౌ విముక్తసంసరణపథానుచరుల
కీయది స్వకీయ మది పరకీయ మగునె
సృష్టిసర్వస్వ మీశ్వరప్రేమగాక

కాన దుర్గమకాంతారమైన మృదుల
సూనశయ్యాప్రదేశమ్ములైనఁ దోడు
వోవురీతినిఁ గాంతు రప్పుణ్యమతులు
సౌఖ్యసంతాపభేదసంస్మరణ విడిచి

పాలకుఁడు లేని రాజ్యవైభవము పగిది
వాసనాహీనమైన పుష్పంబువోలె
తలను దువ్వని యువతి కుంతలములట్లు
వెలవెలంబోవు విధిఁ దలపించె నెల్ల

ఈ యనాదరణంపుఁ బ్రవృత్తి విగత
సంస్కృతవిధాయకక్రియాసక్తమయ్యు
ప్రకృతి నైసర్గికప్రభావముల వలఁ
నెగడుచుండె ననిర్వచనీయ శోభ

శ్రాంత సంతాప వారణాలయముఁబోలు
శోభనాశ్రమమున సహోత్సుక్యమంది
లేచి యాసీనుఁడై మురళిని గుణించి
యిట్లు మెయిమెయిఁబల్కె గౌరీశుఁ డంత

ప్రాజ్యవైచిత్ర్యభరము లప్పరమపురుష
చెష్టములు, కాకయున్న నిర్జనవనప్ర
దేశసంచారులయిన మాదృశుల మఱల
నొక్కదరిఁ జేర్పనగునె యన్యులకు జగతి

ఆశవదలి పునస్స్వమావేశము పయి
తిరుగు మనకొాక జ్ఞానోపదేశ మిద్ది;
దుఃఖకంటకములలోన దొరకువడియు
ప్రణయబంధమ్ము వీడిపోవదు నిజమ్ము

లఘుమనోవృత్తిమైఁ దావలమ్ము వెడలి
నాల్గునెలలకుఁ బూర్వ మానాఁడు నిశిని
మునివరాన్వేషణమ్మునఁ బోవుచుండ
దారిఁ దప్పి చొచ్చితిని కాంతార మొకటి

తినుట కనువైన యాహారమును బరుండఁ
జక్కనౌ పక్కకై యగచాట్లు పడుచు
సంచరించితి రెండు మాసములు, గమ్య
తల మెఱుంగక సంయమీంద్రప్రసక్తి

అంత నొకనాడు ప్రాతరాయాతసమయ
మందు మేల్కాంచి ప్రాంతతోయములలోన
జలకమాడి ప్రత్యూషనిర్మలసమీర
ముల విహారము సేయుచుఁ బోవునపుడు

దివియు భువియును బాండురచ్ఛవి సముద్ర
మధ్యమున నైక్యమందఁ దంపరలుగాఁగ
రాలుచుండె హిమంబు ముత్యాలువోలె
సలలితవిశాలశాద్వలస్థలులయందు

ప్రకృతింబొల్చు ప్రసన్నతామహిమ సంభాషించె వేనోళ్ళ దై
వికనైర్మల్యము తూర్పున న్నవనవావిర్భూతిఁ దోతెంచుచు
న్న కళావైభవమంత నెల్లయెడలం గాన్పించె మార్తాండుఁ డై
హికసౌందర్యము దివ్యసన్నిభముఁ గావించెం బ్రభామూర్తియై

కలకలలాడెడు పులుఁగుల
యులివులు వెలువడఁగ నటవియో లేక సుమం
గళమృదులారావమ్ముల
నలరెడు నుత్సవమొ యనఁగ నచ్చట నొప్పెన్

హృదయరంజకమై నవాభ్యుదయదీప్తి
పయిపయిం జల్లు సూర్యబింబమ్ము వంక
తనియక దృశించుచుండ నిస్వన మొకండు
వడియె నస్ఫుటముగ శ్రవఃపథమునందు

నిర్మలమ్మగు తచ్ఛ్రావ్యనిస్వనమ్ము
పృథులమయి విస్మృమరమాధురీవిశేష
మలమ దిశలందు, దేహము పులకలెత్త
నిటుల వినిపించె నపు డొక మృదులగీతి

మనోల్లాసం గీతం పరభృతసతీనాం కలరవః
మరుత్క్రీడాసత్వప్రచలితమహీజధ్వని రియం
ఝరీసంపాతశ్చ ప్రకటయితుమాహో శుభకరీ
యతంతే యాథార్థ్యం తవ భృశ మసంపూర్ణవచనైః

అసూచీసంచారే క్వచన విజనాబీలవిపినే
విజానన్నాస్మి త్వాం సపది మరణాపాయచకితః
సమంతా త్సంవ్యాప్త స్తవ గహననైర్మల్యమహిమా
కథం భో మాత స్తే భవతి భయహేతు శ్శుభకృతాం

పరోక్షా యావ త్త్వం స్ఫురసి తవ తావ ద్విపులతా
మసంపశ్యన్ భ్రాంతిం వ్రజతి నను మాయావృతజనః
విజానన్ తే రూపం మయి చ ప్రవదా మ్యుచ్ఛ్వవచనైః
త్వమేవాహం నూనం తరుణకరుణాపూర్ణసుమతి !

భావగర్భితమైన తద్వచనరచన
కలన నుప్పొంగి తద్గీతికాప్రయోక్త
నెఱుఁగఁ గుతుకమ్మునన్ శిరమెత్తి చూచి
చెంగటనె యొక్క యాశ్రమమ్ముం గనుగొని

అటకు వడివడిఁబోఁ దదభ్యంతరమున
నాత్మవిజ్ఞానపారవశ్యత మునింగి
గాన మొనరించు సన్యాసి కానవచ్చె
నారదమహామునీంద్రుని తీరు దోఁప

నేలపై వ్రాలి యమ్ముని మ్రోల నంత
నాదిగి పార్శ్వమ్మునం గూరుచుండియుండ
నన్నరసి కుట్ట ! యీ యరణ్యప్రవాస
మేలఁ బ్రాప్తించె ? వగచెదవేల యిట్లు ?

కలిమిఁ దృణీకరించి నయగారమున న్నినుఁ బెంచు తల్లిదం
డ్రుల విడనాడి, దుర్భరమనోవ్యథమై చరియించె దేమియుం
దెలియవు, చిన్నవాఁడవు, వనిం దిరుగాడఁగ నీడుకాదు నాఁ
బలికె మదీయభక్తిపరిపాక మెఱుంగఁ గుతూహలమ్మునన్

నర్మమునఁ బల్కు మునికుహనాహితోప
దేశములనెల్ల సత్యసందేశములుగఁ
దలఁచి, యుప్పొంగు బాష్పవృత్తుల నడంచి
తుద కొసంగితి నిట్లు ప్రత్యుత్తరంబు

కలిమియు లేమియుం గలదె కానల సంచరణ మ్మొనర్చు ని
ర్మలులకు నిత్యవై భవవిరాజితుఁ డీశ్వరుఁ డొండు తప్ప న
న్యు లెవరు తల్లిదండ్రులు ? మనోవ్యథ నొందుట సమ్మతంబ? ప్రా
జ్ఞులకుఁ బరేశునింగుఱించి వోద్యములేదు మునీంద్రచంద్రమా !

అని మదీయాగమనహేతువును వచించి
నా యలంతకుఁ గారణుఁడౌ యతీంద్రు
లాంచనమ్ములఁ గొన్ని తెల్పంగ నతఁడు
చాల నెమ్మదిఁ జింతించి జాలినంది

నా మనోగతభవ్యసంకల్పములను
నాదు విజ్ఞానసంపాదనశ్రమమ్ము
గుర్తెఱింగినయట్టుల గుబ్బతిల్లి
మేదురహితోక్తు లాడె నన్నాదరించి

అమ్మ నీశ్వరు నెఱుఁగుదు, నతఁడు నాకుఁ
బరమమిత్రుఁడు, గౌరవభాక్కు, జ్ఞాని
చాల దవ్వుల నతని యాశ్రమము కలదు
నడువవలె నిర్వదెము దినమ్ములైన

అలజడిఁ దెచ్చిపెట్టుఁ బరమార్థపథప్రథితానువర్తి కం
కిలియగుచుండు నంసరణకిల్బిషవార్నిధి యంచు దానికిన్
వెలియయి బ్రహ్మచర్య పదవిన్ జరియించుచునున్న ధైర్యపున్
నిలయమ ! సంతతంబుఁ గరుణించు నినున్ జయలక్ష్మి తేఁకువన్

నీవు పూనిన పని మహనీయమయిన
పావనబ్రహ్మచర్యసువ్రతము విజయ
లక్ష్మి నిను స్వీకరించు బాలకుఁడ వౌట
మెలఁకువఁ జరింపు మన్నియుఁ గలుగు నవియె

అని వచించి మదీయగమ్యస్థలమ్ము
దీనినిం జేరు త్రోవ, మార్గానుగతని
రోధములు, నవి కడచు తీరును సవిస్త
రముగ బోధించి పొమ్ము, పుత్రా ! యనంగ

ఇరువది దివసమ్ములు కా
ళ్ళరుగన్ కాయమ్ము సన్నమైపోవ వ్యథా
భర మినుమడింపఁ జనిచని
యెటింగితిని దారితప్పె నెచటనో ? యనుచున్

ఎందు నింతియెకా దురదృష్టుల విధి
యని సమీపశిలావేది నధిగమించి
కూరుచుండి దేవుని గీలుకొలిపి మదిని
భావికర్తవ్యమును గ్రహింపంగ లేక

చిఱుత ప్రాయమునం దొనర్చిన పనుల్ చిన్నారి నేస్తంబులుం
బరమార్థైకవిచారణాపరతయున్ బంధూత్కరత్యాగసం
స్మరణమ్మున్, విపినప్రచారబహుళోన్మాదంబునం బోవు న
న్నారయం జొచ్చె, తలంప దుర్భరము లోహో కాలపుం భేదముల్

ఆంధ్రభారతి 1914

## మల్లికాంబ

"లేబరమయ్యేనేమొ ? లవలీలలితాంగిరో ! యిన్నినాళ్ళు గా
రాబముఁ జూపినట్టి జవరాలిపయిం బ్రణయానుభూతి; యే
లా బలవంత మిచ్చకములన్ వెలయించఁగఁ జూచెదమ్మ ? చిం
తాబహుళమ్ములైన ప్రమదాహృదయప్రణయానువర్తనల్

అకలుషితమైన స్వచ్ఛసౌహార్దజలము
వోసి పెంచికొన్న వలపుఁ బూలతీవ
నేల మొదలంటఁ ద్రెంప నూహించెదమ్మ ?
మృదుల మనియైన మది విచారింపఁబోక

అడుగకు మమ్మ! నాదు హృదయంపు వెతల్, ననుఁగూర్చి యిక్కటుల్
బడయకుమమ్మ; లేని పరివాదములన్ భరియింపకమ్మ, నా
యెడలఁ గలట్టి ప్రేముడిమెయిన్; ఫలియింపని నాదుకోరికల్
చెడునని తెచ్చితిన్ బ్రణయిలేఖల నీకడ దాఁచిపెట్టఁగన్

తనువు విలసిల్ల నూత్నచైతన్య మొసఁగు
జీవకళ విని, యెట్లు దాఁచెదవొ కాని
చెలియ!" యని పల్కు కమల మాటల గ్రహించి
యనియె నార్ద్రహృదయ మల్లికాంబ యిటుల:

“కలుషములైన నీవదనకాంతులఁ గాంచిన, యౌవనవ్యథా
కులహృదయమ్ముఁ గాంచిన, గగుర్పొడుచుం దనువల్లి; యెన్ని నా
ళులు కృశియింతువింక, నెటులో ఫలియించెడు నీదువాంఛ, చిం
తిలెద విదేల, ప్రేమముల తీయఁదనమ్ములఁ గూర్చి గోలవై?

ఒరులకు వచింప కీవు నా కొసఁగినట్టి
ప్రణయలేఖలనెల్ల భద్రంబుగాఁగ
దాఁచి యుంచెద నాదు భర్తకును గూడ
దొరకని రహఃప్రదేశమందున లతాంగి!

ఇలువెడలంగఁ బోయెదుసుమీ; నిశలందు వియోగబాధ, వె
న్నెలలఁ గవోష్ణబాష్పముల నించుచు, పుష్పితమాధురీపరీ
మళములఁ జిందువందుఁ బవమానుని సందిళులందు వేఁడియూ
ర్పుల వెలయించునట్లు పెదవుల్ గదలించుచు తేపతేపకున్

వెళ్ళెదవుగాని యీ శిలావేదిపైనిఁ
గొంతవడి కూరుచుండి, తుళ్ళింత లొలయఁ
బాఱు సెలయేటి శ్రావ్యనిస్వనము లెల్ల
నాలకింపఁగవచ్చు రావమ్మ కమల!

కమల

కలవరపోవు నీటితరఁగల్ గనునప్పుడు వాని చప్పుడుల్
గలఁచెడు మన్మనోగతవికారములన్ వ్యసనోదయస్మృతుల్
మెలఁకువ నందఁజేసి; యిఁక మెల్లగ నింటికిఁ జేరుదాన, నీ
ళుల యులివుల్ శ్రవోయుగళిలోఁ గరినమ్ముగ మ్రోఁగు మల్లికా!

**మల్లిక**

ప్రేమఁ బరవశుఁ డగుచు జాబిల్లి తనదు
హిమకరములఁ జక్కిలిగింత లెఱుఁగకుండఁ
బెట్టుచున్నాఁడు సెలల నవ్వించుకొఱకుఁ
గాని వ్యసనప్రబోధముల్ గావు కమల!

**కమల**

ఏల వృథాశ్రమం బడెదవే నవమల్లిక! మోహపారవ
శ్యాలసులైనవారికి యథార్థము గోచరమౌనె? మోహలీ
లాలలితమ్ములైన కళలం గనుపట్టెడుఁగాక సృష్టి; చా
ల్గాలు నుపన్యసింప కబలా! మతికెక్కని సృష్టిశోభలన్

నవ్వినన్ మాఱునవ్వు కొండల విధమ్ము
గాలి నణఁగు నిట్టూర్పులఁ గాంచినావొ?
ప్రకృతి పరిణామదశలు కన్పట్టు మనకు
మన మనోలీనమైన మర్మముల సరణి

యౌవనంపు లతావలయమ్ములందు
దాఁచికొన్న పూవులతోడ నోచినట్టి
ప్రణయపూజావిధానసంభ్రమము లెల్ల
మఱల స్మరియింపుమమ్మ నాకొఱకునైన!

హృదయమునఁ బ్రేమచేతఁ జిత్రించికొన్న
నీదు స్మృతిలాంఛనముల నన్నియును గూడ
కాలకుటిలుఁడు మాయించెఁగాక, యిట్టు
లేల యౌవన మనఁగ నిస్పృహతఁ జెంద?

చంద్రికాధవళితనిశాసమయములను,
గనులఁ జీల్చెడు కాలయామినులయందుఁ
బొసఁగ వనుకూలసంచారములు లతాంగి!
వాంఛితార్థసిద్ధులు లభించకయె, యెపుడు"

కమల వేగమె కడుతమకమ్ము తోడ
మేని కృశియింపు లొకయంద మీనుచుండ
వెడలిపోయె, నంతట మురిపెంపు నడల
లేఖలను గొని యేఁగె మల్లికయుఁ గూడ

మల్లిక శోకలోక మణుమాత్ర మెఱుంగని గారవంపుఁ బు
ట్టిల్లు; మనోజ్ఞదీప్తు లొలయించు నవోదయమందు యౌవనం
బల్లిన సుప్రసన్న దరహాసపటాంచల మామె మోముపై
నల్లలనాడు ప్రేమమలయానిలకంపితకోమలాంకమై

ప్రసవకోమల మగు మేని మిసిమికన్న
నామె కరుణార్ద్రహృదయ మత్యంతమోహ
నముగఁ గాన్పించునంట, దుఃఖమును బాప
నామె సలిపెడు సాంత్వనాలాపములను

ప్రాతరాయాతపూజాపరత్వమునను
చిత్తవీథిని దివ్యరోచిస్సు లెన్నొ
భువనమోహనముగఁ బొంగిపొరలుచుండ
జవ్వనంపు నియోగముల్ సలుపు నామె

విమలవై దికదివ్యతస్వీపథమ్ము
స్వప్నసంచారముల వికాసము వహింప
మానవాతీతనైర్మల్యమహిమలందు
కొలని తామరపూవు నా మెలఁగు నామె

రూపకులమ్ములందు ననురూపగుణుండగు భర్తఁగూడి తాఁ
గాఁపురముండె మల్లిక, యకారణమై చనుదెంచు దుఃఖపున్
రాపిడి లేక, యేక్షణమునం గమలాంబ యొసంగు నుత్తరా
ల్దాపురమయ్యెనో పరిమళంపుఁ బ్రియప్రసవమ్ము రాల్పఁగన్

సఖియ కమలాంబ పూర్వ మొసంగినట్టి
ముద్దు టుత్తరముల నొక్క మోహనంపుఁ
బేటికన్ బరు లెఱుఁగని విధిని డాఁచెఁ
గాని గ్రహియించెనది మల్లికాంబ భర్త

"అనుదినమ్మను నాకునై నను వచింప
రాని గోప్యము లీ మందయాన కేల ?"
అనుచు సందిగ్ధమౌ హృదయమ్ముతోడఁ
దలఁపఁగా రాని తలఁపులఁ దలఁచె నతఁడు

కలల నైనను పంకసంకలనఁ గనని
కలువపూవున కీ తిరస్కార మేల ?
గర్భగతభృంగగణమె పంకమగు ననెడు
బుద్ధివై దగ్ధ్య మెట్టి యబ్బురముఁ గొలుపు !

ఆ సౌజన్యవతీమతల్లి సుషమావ్యాహారమాధుర్యకే
శీసాంగత్యమునందునన్ గమల చెల్మిన్ బ్రేమలీలాశుభ
వ్యాసంగమ్ముల నొక్కనాఁడు రమణీయజ్యోత్స్నలన్ బూఁబొదల్
రాసుల్లాసులుగాఁగఁ గన్పడెడు నారామంబుఁ జేరం జనెన్

అపుడు ప్రాణేశుఁ డతిచకితాంతరమున
గృహగతుండయి, మల్లికామృదులహస్త
గదితమైన లేఖల పేటికన్ విదిర్చి
యందుఁగనియె లేఖాసమూహమ్ము నెల్ల

నవకపుఁ బట్టుత్రాళ్ళ వలనన్ వెడవీడెడు రీతిఁ జిక్కుగాఁ
దవిలిచియున్న పత్రసముదాయము, కంపిలుచున్న హస్తప
ల్లవముల విప్పికొంచుఁ గడలం దిలకించెడు మాటి మాటి కే
మి విశదమాయె నాతని నిమీలితమౌ కనుదోయి కచ్చటన్

సొంతముగ నందుఁ బ్రేమవృత్తాంతవిషమ
పాపపరిణామ మనుచు సర్వము నెఱింగి
తన సతియె యీ ప్రణయనికృంతనమహాప
రాధ మొనరింప దుష్టకారణ మటంచు

అనఁగి పెనఁగి మైత్రినిఁ బెంచికొనినయట్టి
వలపు తలఁపుల నెల్ల నావలకుఁ ద్రోసి
చిరముఁ బూజించినట్టి యా చిగురుఁబోడి
నవ్వుమోము సౌందర్యమున్ మఱువనెంచి

'కవియుచున్న సంధ్యారాగకాంతి మాయు
కారుచీకటు లలము లోకమ్ము నెల్ల
నపుడ చేదింతు నీ పాపవిపులహృదయ
కశ్మలముఁ బాప మత్సతీకంఠ' మనియె

అయ్యయో! యెట్టు లవివేకహతవిధమ్ము
హృద్యసౌహార్దవృత్తి మాయింపనెంచెఁ?
బాపకార్యనిరోధి మిథ్యాపిపాస
మృదులహృదయము నెటు విదారింపఁ దలఁచె!

అకలుషితమగు మల్లికావికచహృదయ
మెఱుఁగ దీ దుండగంపు ధిక్కృతుల గతులు,
ఇంత చిన్నతనాన నూఱేండ్లు నిండు
టయు నెఱుంగదు పాప మాటలను మఱఁగి!

## 2

హిమబాష్పాంబువులన్ బ్రభాతయువతిశ్శృంగారశీలమ్ము తే
జముఁ గోల్పోవు నెఱింగియున్, దరుణతేజశ్శాలి సూర్యుండు రా
గము పోఁద్రోసి నభోవిటంకమున కేఁగం జూచుచున్నాఁడు పా
ప మటంచుం దలపోసె మల్లిక స్వభావవ్యాకులత్వమ్మునన్

బెళుకు చూపుల బ్రకృతి శోభలను గనుచుఁ
బచ్చికబయళ్ళ నేకాంత వనములందుఁ
దిరుగుచుండెడు లేడిముద్దియ వితాన
నడచి నడచి స్వీయగృహాంగణమ్ముఁ జేరె

నవకపు మృణాళతంత్రులఁ గవియఁజాలు
మృదుకరమ్ములఁ బ్రేమార్ద్రహృదయమునను
లోకమోహన స్నిగ్ధవిలోకనముల
నాధునిఁ గవుంగిలించె సానంద యగుచు

శీతలజ్యోత్స్నవలె సుఖోపేత మయిన
కాంతకాంతాపరిష్వంగశాంతిఁ గనక
హృదయనిర్గత మగు ప్రేమవృత్తి నెల్ల
నిరసనప్రాయ మనుచు నిందించె నతఁడు

తేట మొగమున సతతమ్ము నాటలాడు
నిత్యవర్చస్సులు నిసర్గనియతిఁ దప్పె
మృదుతనూలత కాఠిన్యగదిత మయ్యెఁ
బ్రేమ నశియింప నాతని దృష్టిగతుల

ప్రణయతరంగితమ్మగు స్వభావమునం గలకంఠకోకిలాం
గనవలె సమ్మదాశ్రు లొలుకన్ వినయార్ద్రవచోమధుస్వన
మ్మునఁ దన యిక్కటుల్ విరిసిపో నొనరించెడు నామె శ్రావ్యకం
ఠనినద మంత నాతని మనమ్మునకుం గటు వయ్యె వింతగన్

దుష్టసంకల్పకర్శితాత్ములకు నెట్లు
పావనస్త్రీప్రసన్నభావమ్ము లెల్లఁ
బ్రకృతి పూర్ణత్వమునఁ గనుపట్టఁ గలవు ?
నిజమనోనుబింబన పాపనియతిఁ గాక

పెనఁగొనిన తమి వెలార్చిన
యనుతాపమువలన వివశుఁడై లేచి మన
మ్మును ఙా నొనరిచి తా ని
ట్లనియెం బరిపూర్ణనిశ్చయ మ్మలరింపన్

రమణి! యుత్కృష్టకులగౌరవముల నేది
స్నేహపాశము లెల్లఁ ద్రెంచితి విదేల?
మఱచితే ప్రేమసిద్ధాంత మర్మములను
బరహితోద్బోధనప్రభావమ్ముఁ గలిగి

వయసుఁ జక్కందనమ్ము భావమును విడవు
పలుకు నెయ్యంపుఁదీయముల్ వదలఁబోవు
దివ్యసౌభాగ్యవతి వీవు దిక్కుమాలి
కడకు నైచ్యమ్మునకుఁ బాలుపడితి వేల?

వగలం జిక్కి కృశించు నా హృదయమున్ బంధించు నాశాలతల్
తెగిపోయెన్ విధిచాతురిన్; సతత మార్తిం దోఁగి యింకెట్టు లీ
నగుబాటుల్ ఘటియించుచుండెడు దురంతవ్యాధులం జెందిపో
వగ నైరింతును, కాలవాహినిపయిం బ్రాణార్పణవ్యాపృతిన్.

అలికులవేణి! యౌవనపుటార్తులుఁ బో వలపుల్ మనమ్మునన్
మొలకల నెత్తఁజేసి పరిపోషణఁ జేసిన నీకు నీ తలం
పు లెటులఁ గల్గె? లేని వగపుల్ సమకూర్పఁగ, నంచు ఖిన్నుఁడై
పలుకఁగలేక సొమ్మసిలి పానుపుపైఁ బడియెం దటాలునన్!

## 3

నల్లడలఁ గ్రమ్మె సాయంతనంపు టిరులు
నీలకాదంబినీజవనికల వెనుక
మినుకుమినుకను తారకాగణము లెల్ల
మందకళల వెలార్చె నంబరము నందు!

రసవదాలాపగతి నొక రమ్యగీతిఁ
బాడిపాడి కోయిల తనగూడుఁ జేరె;
మంజు గానానురాగ ప్రమత్తయైన
కాఁపుకన్నె మందలతోడఁ గదలి చనియె

వచ్చియును రాని పలుకుల ముచ్చటించు
వలపు బిడ్డల కన్నముఁ గలిపి తెచ్చి
మాయమాటల బ్రమింగించు మాతృవచన
గతులు తోఁచె గృహారామతతుల యందు

అంతయు శాంతమయ్యె; సచరాచరభూతవిభూతి నెల్ల వి
శ్రాంతి వెలింగె; నామ్రతరుశాఖలలో ముడివడ్డ గాడ్పు లా
ర్ద్రాంతరసూచిభిన్నకుసుమావళి రాల్చెడు నిస్స్వనమ్ము లో
క్కింత వినంగనయ్యెఁ జలియించిన కాంక్షల మేలుకొల్పుచున్

అశ్రుతపూర్వమధురగానారవమున
లోలదృష్టుల కాంతి వెల్లువలఁ బాఱ
కెలన నొండొంటితోఁ బ్రసంగించుచుండెఁ
బ్రణయపరిణాహఫణితిఁ దారాగణంబు

ఆరని తాపవహ్ని విరియన్ హృదయానుగతానుతాపముల్
బాఱఁగఁ ద్రోసి దోషకలిలమ్మగు నెమ్మది శాంతి లేక, ని
ద్రారతిఁ దక్కి నాఁడు నడిరాతిరి మల్లిక ప్రాణభర్త తాఁ
జేరఁగఁ బోయె నిస్పృహతచే నిదురించెడు నాత్మకోమలిన్

కరగతనిశితాసిభయం
కరాకృతినిఁ గాంచి సపదికంపితహృదయాం
తరుఁడై, కరుణాపులకిత
శరీరుఁడై, యనియె నశ్రుజలములు రాలన్

"ప్రేమమయము ప్రపంచజీవిత మటంచు
మాటిమాటికి వాంఛావిమానములను
తరుణకేళీప్రచారముల్ జరపినాఁడ
యౌవనానందమందవాతాళి వీవ

ప్రేమారామములన్ విహారములఁ బాపెన్గాని మోహమ్ము కాం
క్షామాధుర్యపదమ్ములందు శయనించన్ జేసె; నిర్వేదలీ
లామౌగ్ధ్యమ్మున నంతరించిన స్మృతుల్ పై పై చిగుళ్ళెత్తి కాం
తామైత్రిస్ఫురణల్ రగిల్చెడు దురంతమ్మైన చింతాచితిన్

భావమా! యేల చంచలత్వమ్ము నీకుఁ
గంటకావృతకుటిలమార్గముల నేల
శాంతిలేని యీ వ్యర్థసంచారసరణి?
నిర్ణయ మొనర్పలేవా యింతిని వధింప?

కేలు వడంకుచున్నది సఖీ! బలవంతము నీదుకంఠ మే
లీల వధింతు? చంపక కులీనత వంశము నెట్లు నిల్పు; న
య్యో! లవమేనియుం దలఁపనోపక ప్రేమశుభోదయమ్ములన్
దేలెడు నూత్నరాగరమణీయతనే కనుఁగొంటి వెఱ్ఱినై"

హృదయనిరూఢిని మాటికిఁ
గదలించు విషాదమున సొగసి, నయనములన్
జెదరెడు బాష్పకణమ్ముల
పొదలిక మఱలించి పలుకఁబోఁ దడఁబడియెన్

హృదయపాత్రికలోన నార్ద్రద్రవమ్ము
లెదిగియెదిగి నిర్భరములౌనేని, యచట
బాహ్యసంచలనమున నెబ్బుంగి, లలిత
లలితభాషాస్వనమ్ములు కలుగఁ గలవు?

స్వాత్మశోభావిలీనప్రసక్తిఁ గనిన
పూర్ణభక్తికి యాచ్ఞానుపూర్వి గలదె?
కుసరితంపుఁ ద్రుళ్ళింతలఁ బొసఁగు రొదలు
వినఁబడునె, పరిపూర్ణవాహినులయందు?

మిలమిలనాడు నూరి పొలిమేరల చాయలఁ బాఱుచున్న కా
ల్వలు వెలయించు నూతనవిలాపము లా నడిరేయి శాంతిసం
చలన మొనర్చి యాతని విషాదమన మ్మలయించె నంత, కాం
క్షలు తెగఁగోయ నెంచు నొడికారితనం బదలించు చాడ్పునన్

సొనలవలెఁ బొంగి పొరలి కన్గొనల జాఱు
బాష్పవృత్తుల నెటు మఱల్పంగ లేక
గద్గదక్లాంతమై, యతికరుణమైన
రుతిని విలపించె వింత విస్మృతినిఁ బొంది

మూసినకన్నుదోయి లవమున్ గదలింపక మోముపైని నూ
త్నానమశాంతిరేఖ లొలయ న్నిదురించెడు మల్లికాంబ, శో
భాసితకోమలాంగి, తడఁబాటున దిగ్గునలేచె వేదనా
వేశము నొంది, బిట్టువిలపించు హృదీశుని రోదనధ్వనిన్

ప్రియుని ప్రాణముఁ గొనఁగ సావిత్రి యెదుటఁ
జీకటిముసుంగునందు నిల్చిన యముండు
వోలె, తన యుసురులను గొంపోవఁ దలఁచు
నాత్మపతిఁగాంచి మూర్ఛిల్లె నబల యగుట!

ఆ యిల్లాలి పయంట నంసములఁ బాయంద్రోసి వక్షస్స్థలిన్
జేయిన్మోపి యతండు కత్తిచెయిఁ జాచెన్గాని, తానంత మూ
ర్ఛాయత్తమ్మగు నాత్మవిస్మయభయవ్యాలోలమై కన్నుల
న్మాయం జాలక విప్పలేక కరుణానూనాక్షియై ప్రీలఁగన్

స్వప్నసంచారశాంత్యవస్థలను వీడి
మూర్ఛపాలయి యేలోకమునకుఁ జనెనొ ?
'మల్లికా ! మల్లికా!' యన, మౌననియతి
హృదయవల్లభు మాటల నేల వినదొ ?

ఎదవిదిర్చెడు విధి చలియించు హృదయ
సీమపై నాడుచున్న ముక్తామణులును
నిలిచెపోయె చిత్రిత విధమ్ముల వెలార్చి
తనువుపైఁ గ్రమ్మె గాఢశైత్యం మంత

గగన సౌదామనీ! మల్లికామతల్లి
వల్లికాందోళికలఁ దెల్లవార నపుడె
పొలుపుఁ గొలుపు స్వర్గపుఁ బూవుపొదలఁ జేర
పుణ్యయువతులు నిన్ గొనిపోవఁగలరు!

పూవుల్వాసెడు ముద్దుచెట్టొకటి రేపున్మాపు ప్రేమాంబువుల్
చేవం గూర్పఁగఁ బెంచికొంటివఁట తల్లీ! కంటకవ్యాపృతిన్
దీవల్ రెం డెగఁబ్రాకి తత్తరువుకాంతిన్ మాన్పె నింకన్ గతు
ల్లేవో? విచ్చని మొగ్గలం దనుచు త్రుళ్ళింపుల్ నివారింపరో?

## 4

కడచనిన రాత్రి యాకుల మడతలందు
నిద్రవోవు నుత్కలికలు నేలమీఁద
రక్తవృంతమ్ముల వెలార్చి రాలిపడియె
నంచు హిమబాష్పముల విలపించుఁ దరులు

దీప్తిరథ మెక్కి ధర కరుదెంచుచున్న
చిత్రభానుని స్వర్ణకౌశేయ మదిగో!
ఉదయపవనములం దాడుచుండె దివిని
గగనసీమంతినియు నవ్వఁ గనులఁ దెఱచి

తోట నడుమల నూత్నకాంతులను, గుసుమ
మందహాసాంజలులఁ బ్రణామ మ్మొనర్చు
వల్లివనజాస్య సుఖపరవశతఁ గనక
తరణి వెదకుచునున్నాఁడు కరము లార్చి

అతిభయానకమైన నిర్యాణపథము
లంధకారబంధురములే యయ్యెనేని
మల్లికావదనమ్మున మలసి మలసి
కాంతికిరణము లేలొకో కళలు విడవు?

వాడని కోరకమ్ము బలవంతముచేఁ జిదుమంగ నెట్లు చే
యాడెనొ? గర్భవాసన బయల్పడఁగ న్ననుపైన రేకులేన్
వీడఁగలేదు; ముద్దు గొలిపించుచుఁ దేనెలఁ ద్రావి భృంగముల్
పాడెడు పాటలేని చెవులన్ దనియింపఁగ లే దొకింతయున్

తారెడు చీకటిన్ ద్యుమణి తాఁ బొడుపందఁగఁ బోవువేళ బం
గారపు కావిరంగున వికాసము నొందెడు తూర్పుదిక్కునన్
దేరిన మల్లికామృదులదేహ మచేతనమయ్యు స్వీయశో
భారమణీయతల్ విరియఁ బాఱిన వీచికలట్లు లాడెడున్

చెలియ మరణించె ననువార్త చెవులసోక
కమల యాజననానురాగమ్ము కొలుపు
కడుపు కోఁతలచే సుడివడుచు వచ్చెఁ
బ్రణయబాష్పజలమ్ము లర్పణముఁ జేయ



3

ఎడయిక తెచ్చిపెట్టు నలయింపుల నెన్నడు పంచుకోక, ప్రాఁ
బడియు నవీనమై కనులపండువు సేసెడు స్నేహబంధముల్
విడివడి స్వప్నశేషముల లీల నదృశ్యము లౌట కబ్బురం
పడి విలపించె జాలిగొలుపన్ గతియించిన చెల్మి నెంచుచున్

కెడల తావులఁ జిమ్మెడు పొడుపుఁబూవు
రాలిపోవంగవలెఁ దప్పరాదు కమల!
కొన్నినాళులు తల నుంచుకొన్న సుమము
'వాడిపోయెనె' యని వగవంగఁ జనదు

పొడుపుమలపయి జీవనపూరములను
ధారవోసి నశించిన వారిదమున
కేల చింతింప? మెరుపు ముత్యాల సరులు
ప్రేలఁ దరలు నీరదకుమారికలఁ గనక

చేలం బూవులు రాల వీచు పవనుండే దీర్ఘవంశీవిలా
పాలోలమ్మగు నూర్పులన్ విడుచు నే యాశ్చర్యమో కాని, బా
ధాలోకమ్మున తన్మయంబయిన చేతం బెట్లు ప్రేమైకలీ
లాలాలిత్య మెఱుంగనేర్చు జగమెల్లం గాంచి చింతావతీ!

బలవదనిలాహతికి నూడిపడు నటంచు
నలుపఁ దలఁచును పుష్పాపచయము భ్రమసి
కాలశాంఖికుఁ డిఁక వియోగస్వరమ్ము
నూఁదునని మాత్ర మెఱుఁగఁ డేమో శరీరి ॰

సౌందర్యశోభల నేమి సౌష్ఠవము గలదొ ?
చకితమృగనేత్రముల నేమి చక్కఁదనమొ ?
నిలుకడలు లేక ప్రకృతిచంచలము లైన
క్షణికసుఖముల నేమి నిశ్చలత గలదొ ?

నాఁడు భరింపరాని వ్యసనవ్యథలం గమలాంబ స్రుక్కి, లో
నాడెడు సందియమ్ముల హృదంతరమున్ విడనీక, కన్నులం
దోడికకట్టు నశ్రువుల నొత్తుచు, లోఁ గదలించు నార్తివో
నాడి, నిషణ్ణయై మనమునం దెదియో తలపోయుచుండఁగన్

ప్రేమనవోదయరహస్యవేళలందుఁ
జెలియకడ దాఁచికొనినట్టి వలపుటుత్త
రములు జ్ఞప్తికి వచ్చి వేగముగ మల్లి
కాహృదీశ్వరుఁ జేరంగఁ గదలె నంత

5

ఏ కడగండ్లపాలయి సహించుచునుండెనొ జీవితార్తి ? యే
చీకటిత్రోవలందు నివసింపఁగ నేఁగెనొ ? దిక్కులేక యే
శోకలఁ బోయెనో ? మరణమున్ బ్రతిమాలెనొ ? శాంతికై వృథా
కోకిలఁ జంపికొంటినని కుందున నేయెడ డాఁగనేఁగెనో ?

ఎద నొక చిచ్చువోలె దహియింపఁగ వ్రాసెడువేళ, కన్నులం
జెదరెడు నూత్నబాష్పకణసేకమునం దడి క్రమ్మి, యాదటన్
జదివినవారి యశ్రువుల చారల నంకితమైన లేఖ యె
య్యదియొ ? తదీయహస్తరచితాక్షరమై కనుపట్టె నేలపై

## లేఖ

నొడువఁగరాని దుర్భరమనోగతులన్ సొలయించు నార్తులన్
దడిసిన యీ విషాదపు టుదంతములన్ బరియించువాఁడ వె
వ్వఁడవొ? దయామతీ! వలపువాసిన వ్యర్థపు జీవితమ్మునన్
దడఁబడు భాగ్యహీనుని కథల్ విననెంచెదవా నిజమ్ముగన్?

తలఁచు తలంపులున్ బడువెతల్ వచియింప నటంచు నెంత ని
శ్చలతఁ గుదుర్చుకొన్నను బ్రశాంతి పొసంగక వ్రాయుచుందు న
గ్గలముగ నశ్రువుల్ దొరఁగఁగాఁ గనులంబడి యక్షరాలపై
యలఁతల కాస్పదమ్ములగు వ్యర్ధపు మాటలఁ జింతసేయుచున్

చలిగాడ్పుల్ చెలరేఁగి వీచునెడ నాశావల్లరుల్ రాల్చు పూ
వులనో, ద్రావిన బంధుజీవములనో, మోహర్తువుల్ తేట న
వ్వుల దుఃఖమ్ముల నన్వయించికొని కొంపోవన్ వృథాభ్రాంతి నీ
వల శోషిల్లి యొసంగుచుండు ననుతాపప్రాప్తి కర్ఘ్యాంజలుల్

# వి భా త గీ తి

మావియిగుళ్ళ మెక్కి సుకుమారతనూశ్రుతి కాననాంతగీ
తావళి నాలపింపఁగ పికాంగనలన్ వడి మేలుకొల్పి లీ
లావిధి వచ్చు పూఁబరపులన్ జలియించెడు నా తుషారము
క్తావలయంబులన్ బసపుకాంతుల నీనెడు నేల రాల్చుచున్

ఊఁగెడు పారిజాతముల నుయ్యేల లూఁగుచు చిన్ని కొమ్మలన్
డాఁగి కుమారగంధముల నాఁచికొనం బువురేకు లూఁది, లేఁ
దీఁగెలఁ జిక్కువెట్టి ప్రతతీయువతీమణి చీరకొంగులన్
లాగుచు నవ్వులాటలకు వనమ్ముల కేగు ప్రభాతవాతమా !

అడవుల పూలపాన్పుపయి హాయిగ నిద్దురవోయి, చీకటుల్
విడివడువేళ మేలుకొని విచ్చిన మొగ్గల నున్న వాసనల్
మెడపయి జారు హారముల లీల దినాధిపుఁ జూడఁబోవు సం
దడి నొకసారి యశ్రుతనినాదములన్ శుభగీతి పాడుమా !

నిలు మొకమూర్తమైన కమనీయమృదూక్తుల నిన్నుఁ బిల్చు న
వ్వుల సెలయేటి కేక లవివో వినిపించెడు దూరమందు చె
క్కిళులను క్రొత్తసుళ్ళు తిలకింపఁగ నా తెలినవ్వులాడియున్
వెలుఁగులతేని కీర్తనలనే జపియించెడు సంతసమ్మునన్ !

కౌముదీసుప్రసన్న మార్గములలోన
శాంతినిబిడమ్ము లగు విపినాంతరముల
సలిపియున్న సంచారంపు స్మరణలెల్ల
నడఁగు చల్లని నీ హృదయమ్ము నందు

పూవులు ప్రోగుచేసికొని, ముండులు గ్రుచ్చుకొనంగ బిట్టు వా
పోవుచునున్న నా హృదయమున్ సుషిమమ్మగు, నీ సజీవ వా
తావరణప్రసక్తిఁ గరుణార్ద్రముగా నొనరించి మోముపై
వీవనలం గదల్పుము, దవీయములై పరువెత్త తాపముల్

నయనయుగమ్ము మూసికొనినాఁడ ననుం గొనిపోయి విచ్చు మ
ల్లియల సువాసనావళుల లీనమొనర్పుము; నీ తరంగసం
చయముల మీఁద నెత్తుకొని స్వర్గపు వీథులఁ ద్రిప్పిరమ్ము; జా
లయి ప్రవహించు కాంతినదులం దవగాహ మొనర్పు మింపుగన్

## ప్రణయస్మరణ

(అరవిందఘోషు ఆంగ్లంలో వ్రాసిన 'అహన' లో ఒక భాగానికి అనువాదం)

అతఁడతిబలుండు రుద్రుఁడే యని వచింప
  నేల సర్వము నాతని లీలగాదె ?
  మృదుమధురరహస్యము లవి యెవరి వగునొ ?
  సలుపువా రెవ్వ రనుతాప జల్పనముల ?
  మన మనుభవించు క్రౌర్య మేమని వచింప
  వలయు ? నక్కట ! యీ శూన్యబాధలేల ?
  స్వాదురాగాంతగతులొ ? తీవ్రతరకృతుల
  మెలఁచు బ్రతుకున కయి వచ్చు పిలుపులేమొ ?
ఆతడేకాదె, బృందావనాంతవాసి !

  అస్మదనునయాలాపదివ్యమ్ములైన
  స్మరణరమణీయవనమహీస్థలములార !
  ప్రసవతతులార ! తరుశిఖరమ్ములందు
  మండుచుండెడు నానందమా ! తదీయ
  నాట్యవేళలఁ బదహతి నలిగి నలిగి
  యతని మొదవుల మేఁతకై బ్రతుకుఁ గొన్న
  శాద్వలములార ! పచ్చని చాయలందు
  హృద్యసంగీతగతిఁ బ్రవహించు యమున !
  స్మరణలాంఛనముల మిమ్ము మరువరాదు !

దొరయు నాతని వేణుమాధుర్యమహిమ
మోహమున ముంచి తన్నిశాబోధములను
కర్ణపుటముల మారు[మోఁగంగఁజేఁయు
శాశ్వత తదీయ విపినవాసముల కడకు
వెన్నెలలు నాట్యముల నాడుచున్న యెడకు
నమృతమాధుర్యమయమగు నతని [పేమ
ఆత్మలను మూయు నవకుంరనావళులను
దొలఁగఁగాఁ [దోసి, యున్నయట్టులనె, నిర్వి
కారగతి 'రండు, రం'డని చేరఁబిలుచు.

తొ[టుపడుచున్న పాదాలతోడ నంతఁ
బులకరించు మేనులఁ [బమత్తుల విధాన
నతని భయదోపగూహనతతులఁ గోరి
యతని యానందమునకు దాస్యత్వమూని
స్నేహచిహ్నితముఖముల నిండుకొనఁగ
వెడలిపోదుము బృందాటవీస్థలులకు

పచ్చికల పట్టులందునఁ బవ్వళించి
స్నిగ్ధనయనద్వయమ్మున నిక్కిచూచి
నిగనిగని దేహరుచుల నీనెడు మొదవులు,
మమ్ము నలరించు శాఖాసుమమ్ము లెల్ల,
హిమమయూఖము లాశ్చర్యవృత్తిఁ జూపు,
యమున సన్నంపు టెలుఁగుల హోసమొలయ
యెదురుగా మాకదే ! [పవహించుచుండు,
శ్యాముఁ డాటలు నృత్యముల్ సలుపునట్టి
స్థల మదియె కానుపించు బృందావనమ్ము !

## కర్మ

**రాధాఽనునయము**

(అరవిందుని యాంగ్లరచన కనువాదము)

ప్రణయనిధాన ! గాలివలె వ్యర్థము లయ్యెడు నస్మదీయభా
షణములు, దుఃఖమే యెఱుఁగఁజాలని నా మధురప్రపూర్ణయౌ
వనమునఁ బ్రేమవాగురము పైఁ బడవేసి, క్షణమ్ము లోపలన్
ననుఁ గొనిపోతి వింటనయినన్ వసియింపఁగనీక నెచ్చెలీ !

తిపురుటకు నింకఁ గార్యమేదియును లేదు,
ఆత్మ నొక గాఢవాంఛానియంతఁ జేసి
యబ్ధిలోఁ గ్రుంకి మరణింతు; నంత హృదయ
పదము తాపానలమ్మును బాయఁగలదు

మరణమొంది జన్మించెద మఱల, నంద
నందనుఁడనయి వ్రజసుతానందమునకు,
నవ్వులీనెడు తరుణాననమును, గుటిల
చికురములతోడ రాధగాఁ జేతు నిన్ను

అంత నిన్నుఁ బ్రేమించి మాయమయిపోయి,
జలముఁ గొనిపోవఁగఁ గదంబశాఖ క్రింద
నీవు చనియెడు వేళల నిలిచి నిలిచి
మురళి వాయింతు భువనసమ్మోహనముగ

నాదు గానమ్ము వినియు, సౌందర్యమునకు
మోహమందెద, వంత నా ముద్దుపిలుపు
ముదమొదవఁజేయు నీ ముగ్ధహృదయమునకుఁ
బ్రణయకటుకత్వ మపుడ కన్పట్టు నీకు !

## ప్రేమోదంతము

(నైజామి అనే పర్షియన్ కవి వ్రాసింది మజ్నూన్ ప్రేయసి లైలికి వ్రాసింది)

మాధురీసాధురీతుల మసలుచున్న
పొడుపుతెమ్మెరలార ! నా ముద్దులాఁడి
కౌఁగిలకు స్వాగతముఖులయి యరుగఁగలరొ ?
మెలపు లొలసెడు నాపె కుంతలములందు
మధురకుసుమాసవముల సంప్రాప్తిఁ గోరి
మెలఁగువేళల నా ముద్దు తలఁపు లెల్ల
ప్రేమతోడ నాపెకు వినిపింపఁగలరె ?
మృదువచోభంగి, సన్నంపు టెలుఁగుతోడ
నీయుదంతము నాపె కందీయుఁ డిటులు

"భావవీథులఁ బగలు స్వప్నముల రేల
నీ శుభాకృతి యెపుడుఁ గన్పించుచుండ
శోకసంహతులగు పురుషులకు, హర్ష
లాంఛనమ్మయ్యె నీ ముఖలక్ష్మ[1] సతము,
ముగ్ధదృష్టుల కొక యందమును ఘటించు
నా కళంకంపు సొంపు నాకరయరాదు.

1 ముఖంలోని పుట్టుమచ్చ పర్షియన్ల దృష్టిలో సౌందర్యచిహ్నం

మనమును గఱంచు నీ సుకుమారరీతు
లెవని హృదయముఁ గలఁచి ప్రేమవిధు లెల్ల
నెగసి యుప్పొంగు గతి చరియింపలేవొ?
అది యమానుషమగు హృదయంబొ? లేక
హిమసమవ్యాప్తగురుశిఖరముల నొప్పు
'కాఫ'[2] గిరివోలె శైత్యకల్మషంబొ?
మధురమధురమ్ములయిన నీ యధరరుచులు
రాగమునఁ బ్రవాళములఁ దిరస్కరించి
చక్కెరల తియ్యఁదన మెకసక్కెమాడు

అకట! ఆ మాయచూపు చీలికలఁ జేసె
నాదుహృదయము నంత సౌందర్యసిద్ధి
బాధ నెక్కింపఁగాఁ బూలబాణ మేసె,
పుట్టిపెరిగిన చోటుల పూవులెన్నొ
వింతరంగుల మెలసి, యీ విధపుఁ బనుల
నేలపై రాలిపోయి జీర్ణింపవలసె.

ద్యుపదవీచరులకును, నెత్తుకొనిపోవఁ
దలఁపుఁ బుట్టింపఁగల్గు నిధాన మనుచు
సుగుణవతి వని నిన్ను, విశుద్ధచరిత
వని నుతింతురు కవిపుత్రు లనవరతము."

---

2 కాకసస్ పర్వతశ్రేణి

నవ్యసౌభాగ్యచిరమోహనమ్ము లైన
లేయనంట్ల కుదుళ్ళ నీర్వోయుచుంటి
నొక్కనాఁడు కృపాపూరణోత్సుకతను;
చెంతఁ బెరిగెడు పూవులచెట్టు లెల్ల
బాలభానుని బంగారుపాదములను
ముద్దుగొనుచుండె సౌందర్యమును వెలార్చి.

ఎచటినుండి యేతెంచెనో యేమొ ? కాని
లలితలావణ్యసుమకోమలమ్ము లైన
లేఁత మొక్కల వడిఁ గబళింప వచ్చె
ధేను వొకఁడు మత్సుందరోద్యానమునకు
క్షుత్ప్రపీడనమునకు రోఁజుటను జూచి
యేలొకో దాని మరలింపఁ జాలనైతి
చిరము సోదరమైత్రిఁ బెంచిన చిగుళ్ళఁ
బ్రేమవిచ్ఛేదమై యాహరించు విధముఁ
గాంచి బాష్పకలుషితదృగంచలముల
దుఃఖమును మ్రింగలేక, యద్దుకొనుచుంటిఁ
బ్రకృతిపరిణామ మెంత చిత్రము కుమార !

# పూ జా శి రీ ష ము లు

1

పూజాశిరీషము లేరుకొంటివి
పోయివచ్చెదో ? జవ్వనీ !
తేజోనిలీనదృగంచలమ్ముల
తేటిచూచెద వెవ్వని ?

2

ఆనందవస్త్రము లే కుమారుం
డల్లు తెల్లగ నల్లగా ?
ధ్యానంపు హైందవగీతి నెవ్వం
డల్లు నల్లగ తెల్లగా ?

3

ఆలింపు పాడెద నాంధ్రకోమలి
యార్ద్రహైందవగీతులన్
పాలింతు నెల్లెడ భావపుష్పిత
నవ్యశయ్యారీతులన్



4

# సాధు గీతి

**1**

లతాంతార్ద్రరాగమ్ములం బాడు తేటుల్
వసంతమ్ము కాంతిప్రవాహమ్ము లందున్
నిసర్గాప్తశోభావినీతిం బ్రియమ్మై
కనుల్గుట్టు చందానఁ గాన్పించు పూవుల్
కనుంగొన్నచో వేఁడికన్నీళ్ళు రాలున్
అలంకారముల్లేని యా పూల ముగ్ధో
క్తులన్ లీనమైపోయె దో సాధుగీతీ!

**2**

కవిప్రేమ పుష్పింపఁగాఁ జేయు కృష్ణా
స్రవంతీతరంగాంతరంగమ్ముఁ జూడన్
హతస్వాంతయై దీనయై తీరభూమిన్
వెతల్విప్పి వాపోవ వీక్షించు కన్యా
మణీశోకమూర్తి శ్రమల్గన్న రాగా
రుణమ్మైన చింతాఝురుల్ వాలు నాత్మన్
అలంకారము ల్లేని యాకన్నె శీతా
ర్తులన్ లీనమైపోయె దో సాదుగీతీ!

## ప్రణయశాంతి

రాలిపడియున్న దానిమ్మపూలతేకు
తొలయు చోటుల సాంధ్యవాయువులలోన
కనఁబడని భావముల సువాసనలకొఅకు
వినయమున బాల్యదృష్టి నిల్పితి నొకింత—
ప్రణయవతి ! ప్రేమమునకు పారమ్ము లేదు.

నీవు పాడిన కృష్ణవేణీస్తవమ్ము
హృదయపదమున నొక సెలయేఱువోలె
చల్లనగు తుంపురులు వెదఁజల్లు వేళ
పలుకరాని గీతిక కలకల మొనర్చు—
ప్రణయవతి ! ప్రేమశాంతి కే భంగమగునొ ?

## ఎడఁబాటు

లక్ష్మణా! చూడు మేలకి లతలు పూసె
వాసనల నిండుకొను మాధవీసుమములు
సీతకన్నులువోలె విచ్చె నొక కొంత
వేదనలు విచ్చె నా మనోవీథియందు

లేఁత సూర్యుని చిఱుత చీలికలఁ బోలు
పంకజమ్ముల వెలుఁగు పంపాసరస్సు
మోహనవసంతు కేళీప్రమోదమునకు
పూలనవ్వులఁ గురియు భూపుత్రి నేఁడు

అడవి ఱానేలలందు నెన్నఁడును దిరిగి
యలసి యెఱుఁగని యతివినయార్ద్రచిత్త
జానకి యొనర్చు సాంగత్యసౌఖ్యమునకు
తలఁపు లేకాగ్రతావృత్తిఁ గలసిపోయె

## భవతి! భిక్షాం దేహి!

నోటినిండ భుజింపఁగ నోఁచికొనము
ఉదయగీతుల పాడనోపెదము కాని
కన్నతల్లుల ప్రేమమార్గమ్ముఁ గనము
లలితగతి వీణ వాయింపఁగలము గాని
తొడిమ లెడసేయఁగా రాలిపడిన పూల
వలపులేవి? భిక్షాందేహి! భవతి! భవతి!

స్వాదుకృష్ణానదీజలస్నానములను
పులక లొలయఁగ వినయాంజలుల ఘటించి
నవ్యగీతాశుబాధ్యయనమ్ముఁ జేయు
సోదరకుమారకు లెదురుసూచుచుంద్రు
తడవుసేయక మాతృవాత్సల్య మింత
తిరుగు బిడ్డల కిమ్మింక మరలి యరుగ
వలయుఁ దల్లి! భిక్షాందేహి! భవతి! భవతి!

# తిక్కన సోమయాజి

**1**

పూజాతిసాంద్ర కర్పూరమ్ములందు
ప్రాజ్ఞదీపాథోలవమ్ములయందు
మడగు సన్నని పాట
పొడుచు వెన్నెల తేట
కలవు తిక్కన పల్కు తెలుఁగుపల్కులకు

**2**

లోలమృద్వీకాగుళుచ్ఛమాధురియు
నవపుష్యరాగసుందరపటిష్ఠతయు
అలరు మల్లియ పువ్వు
నందు పిన్నని నవ్వు
కలవు తిక్కన పల్కు తెలుఁగు పల్కులకు

**3**

కృష్ణవేణీతరంగిణి నున్న ఝురియు
తుంగభద్రాసరిత్తున నూఁగు హేల
ధవళగోవ్రాతము
నవ నవనీతము
కలవు తిక్కన పల్కు తెలుఁగు పల్కులకు

## 4

లజ్జామనోహరలావణ్యమూర్తి
తేజోరుణాక్షిసందీప్త పాంచాలి
కనుల క్రొమ్మెఱుపులు
కనుబొమ విరుపులు
కలవు తిక్కన పల్కు తెలుఁగు పల్కులకు

# స్వచ్ఛంద ప్రయాణము

దివ్యయువతుల సంభాషణ

**సానుమతి**

విడివడు టోర్వఁజాలని నవీనమనఃప్రణయమ్ములట్లు త్రో
పుడుల పరస్పరప్రణయమోహనమౌ నలలం దడంగి వి
చ్చెడు కమలమ్ముపోలె నదె చేరువఁ దోఁచెడు నేలఁజూడు మ
ప్పుడమి విశుద్ధులౌ భరతపుత్రులఁ గాంచిన తల్లి నెచ్చెలీ!

వాడని పారిజాతసుమవల్లరులం దగిలించుకొన్న మీ
వాడల నాకవీథికలు వాడిన పూవులవోలె శోభలన్
వీడవె, భారతీయపృథివీస్థలి నంతయుఁ బ్రాఁకి నేఁడు తూఁ
గాడు వసంతరోచిరుదయమ్ముల మిన్నులఁ బాడఁ గోకిలల్ ?

వీచీవాదములందు రాగములు పుష్పింపంగ స్వచ్ఛందశో
భాచిహ్నంబులు వింతలై నయననిర్వాణమ్ము నందించుచున్
లేచెన్ మంటలవోలె నెల్లెడల, పల్లీపట్టణమ్ముల్ ప్రబో
ధౌచిత్యమ్ముల వెల్వరించెడు సపర్యల్ చూడు మాయుష్మతీ!

**మధురరిక**

జాహ్నవీ సేచనమున స్వచ్ఛమ్ములైన
జీవనముల, హిమాలయశిఖరి నీడఁ
గడపు నా నాగరకుల కేర్పడవె యెట్టి
పావనములగు జాతీయబాంధవములు !

ఏ నిబిడాటవీస్థలుల, నే గుహలందు నెఱుంగరాని యే
మౌనుల పర్ణశాలల నిమంత్రితమై యెట డాఁగియుండెనో
యీ నవకావ్యశోభ ? పొలియించిన స్వేచ్ఛల కేడ్చు వాహినుల్
వీనుల కింపుఁగాఁగ వినిపింపఁగ పాటల నెప్డు నేర్చెనో ?

**సానుమతి**

భానుఁడు పుట్టి యస్తగిరిపై నిదురించె, సుధాకరుండు మం
దానిలుఁ బాలవెన్నెలలయం దడఁగించి చనెన్; గభీర గం
గానది శీతగర్భమున గానమువోలె నడంగియుండె వి
జ్ఞానము లోకమందు, గగనప్రభ లేడనొ డాఁగె మబ్బులన్

పూయని పూవులం దడఁగు పుప్పొడి రీతిని, నందె చీకటుల్
మూయని వేళ శ్యామలనభోమణియందలి కానరాని తా
రాయువదీప్త లట్టులు సరస్వతి మిన్నక యుండె, నంత కా
లాయతి చించుకొంచు కవితార్ద్రములై చనుదెంచె గీతముల్

ఆనందమ్మున నైక్యమై యపుడు బృందారణ్య మల్లాడె, వి
జ్ఞాన మ్మెల్లెడ నల్లువెట్టుటకునై చైతన్యవిద్యాపతుల్
గానమ్ముల్ వెదఁజల్లి, రాధునికగంగాతీరసంవాసు లే
యే నోముల్ పచరించియుందు రొకొ దేవీ ! యీ శుభప్రాప్తికై

వీరవ్రతకంకణు లని
వారలు గీతాకుమారవరు లీశ్వరు లీ
భారతపుత్రకులే, హిం
దూరమ తలఁదాల్పఁ దగు మణులు నయవేత్తల్

చేసిన రాజకృత్యములు సింధునదీతటులందు నెన్నఁడో
మాసియు నేఁటికిన్ స్మరణమాత్రన సంగరలక్ష్మి కందఱన్
దోసిళ లొగ్గఁజేయు కొలఁదుల్ గల, వా విజయప్రబోధవి
ద్యాసుతులున్న వాసములు నల్లవివో! హిమవంతు చేరువన్

నర్మదాశుభ్రవీచీకణమ్ములందు
నిండియుండు స్వేచ్ఛాపురంధ్రీమతల్లి
ఋషులనోటఁ బాడిన స్వమాతృస్తవములు
గాలి నడఁగిన కోకిల గాన మట్లు

ఈ విమలప్రదేశమున నెందఱు పాడఁగలేదు లోకలీ
లావిదులై ప్రబోధసరళమ్ముగ పాటల, జన్మభూమికిన్
సేవకులై మఱెందఱు రచింపఁగ లే దెదిరింపరాని తే
జోవిభవమ్ముచే ప్రజల చొప్పులయం దనురాగబంధముల్

అల్లదె! యాంధ్రభూమి! సమరావనులన్ జయశంఖ మొత్తు రా
ట్టల్లజులందుఁ గల్గిన స్వతంత్రులు వోయెడు నేల, శేముషీ
పల్లవితమ్ములౌ సరళభావము లం దొక క్రొత్తరీతిగా
నల్లిన సీమ భారతమహాహవ మందలి జీవగీతులన్

చదువు లాధారమైన తేజమ్ముతోడ
పౌరుష మ్మూఁతయైన విద్వత్తుతోడ
సాహితీస్నేహితు లగు రాజప్రముఖుల
సంతతి కసాధ్య మనెడు విచారమేల?

### మధుకరిక

వెదురుల వేఁడియూరుపులు పిట్టలొనర్చు కుహూరవమ్ములన్
గదిసి మహానిలమ్మున నొకానొక మేళన నొంది యేకమై
పొదలెడు నస్ఫుటారవమువోలె క్రమమ్ముగఁ బ్రాఁకు నీ మహా
భ్యుదయము లావరించిన విభూతి యనన్యమనోజ్ఞ మంగనా!

### సానుమతి

పూచియు పూవకున్న సుమముల్ సుడిగాడ్పుల విచ్ఛిపోల్కి స్వే
చ్ఛాచలనమ్ములందు నవశమ్మగు లేఁత మనమ్ముతోడ చె
ల్లాచెదరైన సాధనములన్ దమకమ్మున చక్కఁబెట్టుకోఁ
జూచెద రిష్టు పోయిన యశోవిమలాంకము లాసఁ జేయుచున్

వెన్నెలలు రాలు నడుగు మోపిన క్షణంబ
నయనముల విషాదమునకు నవ్వులొలయు
నామె చనుదెంచె నుదయలక్ష్మిమతల్లి
పూలపేటిక కుడిభుజమ్మునఁ దవిల్చి

# కాపు పాట

ప్రేయసి ! లేచిరమ్మ, చివురించిన మావులక్రింద శీతల
చ్ఛాయలలోన యౌవనవసంతశుభోదయ మయ్యె నవ్వుచున్
చేయికిఁ జేయిఁ జేర్చి పెఱచింతనలన్ మఱపించు రాగముల్
దీయుచు వాసనల్ పరిమళించెడు చోటులయందుఁ బోవఁగన్

వ్రాలిన సంజలన్ మరలివచ్చెడు గోవులఁ బాలు తీయఁగాఁ
దోలెడు దాఁక, త్రాడులును దుత్తలు నావలఁబెట్టి సిగ్గులన్
సోలెడు చిన్నదాన ! యెటుచూచిన నెవ్వరు లేనిచోట ను
య్యాలలనెక్కి యూఁగ మనసయ్యెడు నీవును నేను వేడుకన్

పాడుట కొప్పవేని పడవల్ నడిపించెడు యేటి త్రోవలే
చూడఁగవద్దు, లేఁతమనసుల్ తడిసేసెడు చెట్లచాటునన్
గూడిన మేను లానుకొన కొమ్మల కాకులువోలె నొక్క మా
టాడక కూరుచుండ మనువైన పొలమ్ముల గట్టునీడలన్

## అరవింద ఘోషు

కొండల దండ శోభ కనుగో నిలువంబడి శ్రావణాంబువుల్
నిండఁగఁ బొంగి బిట్టఱచు నిర్ఝరిణీశ్రియదూర్మికింకిణీ
తాండవముల్ వినంబడు విధమ్మున నో యరవింద! వింటి నె
న్నండొ భవద్గభీరకవన మ్మది నేఁడును క్రొత్తఁ గొల్పెడిన్

గుమ్మడిపూవుఁదేనియలకున్ సరిపోవును నీదు ధోరణుల్
జిమ్మెడు మాధురుల్, రసనిషేవణముల్ తుదినొందువేళ నా
కుమ్మడి నీ కడిందిపలుకుల్ వినిపించెద; వంత పూవు చం
దమ్మున విచ్చు జన్మమరణక్షుధితాధికజీవితావధుల్

పాడయి రాయచూరువిభవమ్ముల నిల్చిన జీర్ణభిత్తికల్
పాడు నుదాత్తపూర్వకథలన్ వలె, నీ యెలజవ్వనమ్ము సం
పీడల నొందియున్, హృదయవృత్తశుభాశలు భగ్నమయ్యు పో
నాడవ యిందియాజననియం దభిమానమనోవిచారముల్

# అప్రాప్త మనోహరికి

ఓ నవనీతకోమలవయోరుచిరాంగి! యనుగ్రహింపు ప్రే
మానుమితాస్మదీయవచనావళులన్; భవదార్ద్రరాగస
న్మానితుఁ డైన యీ కవికుమారుని పల్కులు నీమనోజ్ఞనే
త్రానుగతాచ్ఛశోభనము లందుకొనం దలలెత్తవేనియున్

చీకటిదారులందు వికసించిన వెన్నెలవోలె, తీవ్రబా
ధాకులులైనవారలు సుధాసరసిన్ గొను స్నానమట్లు శ్యా
మాకృతిఁ దాల్చి నాదు హృదయమ్మున నిల్చిన దివ్యరాజ్ఞి! నా
కై కరుణించి నీ తనువికాసము నింపుము నా మనమ్మునన్

మోమున మోముఁ జేర్చి నిను ముద్దిడు కోరిక లేదు; నీదు వ
క్షోమృదుశయ్యపైని శిరసుం గెడవాలిచి, వ్రేలు మల్లికా
దామసువాసనామధురతల్ పరికింపఁగఁ గాంక్షలేదు; నా
ప్రేమకు దారిఁ జూపఁగ వరించితి నా యలరించు నెచ్చెలీ!

మ్లానమతిన్ దృగంచలములం దొలుకాడెడు నీ మనోజ్ఞతల్
లోన నడంగు నశ్రువులలోఁ దడుపం దలపెట్టఁబోక వై
జ్ఞానికసాధుభాషణములం దనియింపుము నన్ను; నా మదిన్
లీనవు కమ్ము, నన్ గవుఁగిలింపుము నీ కమనీయశోభచే

## మహాకవి తిక్కన

కవికులపుత్రు లేయెడల గానము సేతురో కాని, నేఁడు కై
తవకవితాప్రసూనముల తావులె మమ్ముల నావరించు, మా
ర్దవ మడుగంటియున్న కవితాలత కృత్రిమశోభ చూచి చూ
చి విసుగువచ్చు నీ వలె సృజించు నుదాత్తమనమ్ము లేమిచేన్

నీమహనీయగానరమణీయత వీనులఁ గ్రోలి, పూతకృ
ష్ణామలతోయమందలి ప్రశాంతపు రాగము లాలకించి, బా
ధామలినమ్ములౌ బడుఁగుదల్లుల వృత్తము లెల్లఁగాంచి, యే
సీమల నెవ్వరేని వెలిసేయరుగా కవితామృదూక్తులన్ !

రాచకులమ్ము ప్రల్లదపు రాగములం జపియించనేర్చి, లో
కాచరణమ్ములన్ సరళమై ప్రవహించెడు జీవవాహినీ
వీచికలం దడంగిన నవీనమనోజ్ఞత లెల్లఁ జూడఁగా
నోఁచని శుష్కమానవమనోగతులం గవితల్ వరించునే ?

నీ కవితాప్రపంచమున నిల్చి దిశల్ పరికింప, విస్మయ
వ్యాకులలీల నా మది స్వభావమనోహరసస్యసంపదం
జేకొని వెల్గుపర్వతపు సీమలు నిల్చినయట్లు దోఁచు, వీ
ణాకలనాదముల్ రణరణన్మధురంబుగ సందడింపఁగన్

నీ లావెన్నఁడొ చెల్లిపోయె, నయినన్ నిత్యోదయం బందు శో
భాలీనమ్మగు బాలభూమి, ఋతువుల్ ప్రాపించు; కల్యాణరా
గాలాపమ్ముల సత్కవీశ్వరులు సేయంజూతు, రెట్టైనఁ బ్రా
చీలాలిత్యము లందునే చరమరోచిశ్శోభియౌ భానునిన్ !

చిఱుతలగు మాకు నీదు విస్తృతకవిత్వ
నాగరకత శాశ్వతపుఁ గాణాచిఁ జేసి,
కడచనిన నీ యుదాత్తసంకల్పములను
దలఁపఁ దలఁప నేయానంద మొలయఁ బోదు !

ప్రణయుని ప్రౌఢదృష్టిఁ దలవంచి, రహస్యమునందు మెల్లమె
ల్లన మధురాధరమ్ము కదలం గదుఁ దీయని మాటలాడ నెం
చిన సుకుమారికిం బలె, స్ఫురించు తలంపుల నెల్లఁ జెప్పనో
పని తమితోడ, నాతిరసవంతములై సరివోపు నానుడుల్

ఓ కవిచక్రవర్తి ! వినయోచితవందన మందుకొమ్ము, స్వే
చ్ఛాకవితాప్రచారములఁ జక్కని నీ కవితాప్రసక్తి నెం
దాఁక స్మరింతు, నందలి యధార్థమునన్ ముదమంద నేర్తు, నం
దాఁకఁ బవిత్రభావములఁ దాల్తు యశంబు తృణీకరించుచున్

ఎఱుఁగఁగ రాక మాటికి స్పృశించి తనూలత నూఁచు భావబం
ధురమగు శక్తికిన్ వెరవు దోఁపఁగఁ జక్కని రాయబారివై
తరుణుల నూతనంపుఁ గవితాహృదయంబుల దివ్యగీతముల్
వఱపుము; దారిఁ జూపుము కళాజగతీస్థలి నాంధ్రబాలకున్

హిమవదుపాంతపుం బొడుపుటేళ్ళ సితాంబువులం గదల్చు హం
సములవలెన్, భవత్తనయసంతతి శోభితమయ్యె; వింత పు
ష్పములు గృహమ్ములందుఁ దమవాసనలన్ వెదఁజల్లె సోదర
ప్రముఖుల సోదరీమణుల పావనరాగము లుల్లసిల్లఁగన్

## స రో జి నీ దే వి

తొలిప్రొద్దు రేకలు
పులుఁగుల కేకలు
తలసూపు మోకలు
కడలేని బంగారుగనులు; సరోజినీగానకళకలములు

జ్ఞానావధులనేలు
నానందపుఁ బదాలు
దీనుల చుట్టాలు
క్లాంతమనశ్శీతలములు, సరోజినీగానకళకలములు

దారితప్పిన చోటఁ
జేరిన సెలయేటఁ
బాఱు మెల్లని పాటఁ
జిందు తియ్యఁదనాల చెలులు; సరోజినీస్నిగ్ధగీతములు

# సౌందర్యము

(రవీంద్రుని భావాన్ని అనుసరించి వ్రాసింది)

ఏ విరియు మల్లియల పూవుఁబొదలందు, విడి
వోవు సెలయేళ్ళ మృదురావములయం దే
మావుల సుశీతలపు తావుల జనించితివో ?
యే వనచరాంగనలు దేవికడ పాలన్
ద్రావు నిను లేమొగలిపూవువలె లాగికొని
పోవుదురో ? పాడువడు త్రోవలను సౌంద
ర్యావృతవతీ! నరుల చావులను రాలిపడు
పూవులను భావములు పోవని విధాలన్

## బహుమతి ప్రదాన పద్యములు

(మైసూరు సంస్కృత పాఠశాలావిద్యార్థి
బహుమతి ప్రదానోత్సవంలో చదివినవి)

భాగ్యకవుల కంఠములకు పద్యపుష్ప
హారము లమర్చు నో యశరీరవాణి !
పొగడు మీనూత్న కర్ణాటపుణ్యభూమి
నావరించిన విద్యాశుభాంకురముల

జ్ఞానావస్యభిరామవాటికలపై కర్ణాటజాతీయదీ
క్షానవ్యోత్సవసంప్రదాయము లలంకారమ్ముఁ గల్పింప, ని
ద్రానైల్యమ్ముల నెల్ల వోవిడిచి, గీర్వాణాంగనాజైత్రని
ధ్వానమ్ముల్ దిశలల్లె మోము లలరింపన్ నేఁడు శాలాసుతుల్

వడలకు వాడువాఱిన జపాకుసుమమ్ముల ఱేకులందు రా
లెడు హిమశీకరమ్ములవలెన్ నడియెండలఁ బాఱిపాఱి సో
లెడు హరిణాంగనన్ గవుఁగిలించెడు చల్లని నీడలట్లు లె
క్కుడుగఁ దపించు మానవులకున్ సుఖదమ్ములు జ్ఞానమేఘముల్

పూవులు పుష్పించు పోలిక, చదువులు
విప్పిచూపెడు మురిపెములు గలిగి
అలఁతిత్రోవలలోన నడఁగిన యభినవ
సౌందర్యముల వికాసములు గలిగి

తెలిలెడు మున్నీటికలడుల డాఁగిన
యన్యోన్యముల కన్వయమ్ము గలిగి
అలజడినొందు ప్రాణుల కష్టగతులకుఁ
దాపోపశమనవృత్తములు గలిగి
లోకపరిణామగీతు లల్లుకొనియున్న
భారతీసుందరకుటీరపరిసరముల
ప్రొద్దుపుచ్చుటకన్న నేపుణ్యకృతులు
వేఱు కలిగెడు విద్యాకుమారకులకు ?

## బాల్య స్మృతి

పెంచితి నీరుపోసి మొలిపించిన స్వాదుపదార్ధసాహితీ
కాంచనరాగవల్లికల; గాఢతమోమలినమ్ముఁ బాపి, మ
త్సంచితప్రాగదృష్టము వశమ్మున నా హృది; నాఁటనాఁటకున్
గొంచెముకొంచెమై వెనుకకున్ విరమించెదవేల యింతలో ?

నవ్యతేజోవతిని వసంతసుకుమారిఁ
గూడి నవ్వుపూవుల మావితేఁడు వోలె
నీవు నేనును గూడి యాశావదాత
తీరములఁ బాడు పాటలు దూరమగునె ?

మాతృవదనమువలె చందమామముఖము
తొలఁకు నవ్వులతోడ ముద్దుఁగొనవచ్చు
ననెడు పల్కు నమ్మించి మాయల ముసుంగు
నిలిపి, పైఁడికంకణము లందింతు రెవరు ?

చేయికి చేఁ దగిల్చికొని చిత్తమునం దొకవంతలేక యీ
యాయెడలందునన్ సఖులమై విహరించితి; మింక నీవెటో
పోయిన నా సుఖమ్ము సగముం గొనిపోయెదు, నీవు లేక నే
యే యెలద్రాక్షపందిళుల నెక్కి వరింతు దురాపరాగముల్

నా కారిన్యము నాపయిన్ విడిచి, నగ్నమ్మైన నాముగ్ధవాం
ఛాకల్యాణపదమ్ములం జెటిపి; స్వేచ్ఛాకీరమున్ పంజర
స్వీకారమ్మునఁ ద్రోసిపుచ్చి యిపు డే వీథీవిటంకమ్ములన్
బ్రాఁకం బోయెద వీ వయోవిరహభారశ్రాంతి మోయించుచున్

# మృత ప్రేమ

ప్రోవులై రాలె హృదయసరోజదళము
లాకులితవై భవమ్ము చీకాకుపడఁగ,
వంచిన ముఖాన నేయెడ పొంచియుందు
వాకు కదలని నేఁటి మధ్యాహ్నవేళ ?

నైజరుచిరమ్ము లగు స్రవంతీజలమ్ము
లారిపోయిన రాతిబయళ్ళవోలె
రిత్తయయిపోఁ దలంపుల మెత్తఁదనము
గిల్లుకొనిపోయి యెద డాఁగికొనె దిపుడు ?

## కా వే రి

(అగస్త్యకుమారుని వియోగరాగం)

ఉదయారుణ్యము లీ వనాంగణతరువ్యూహమ్ములందున్ రమా
స్పదమై యల్లుకొనంగ, నస్ఖలితపూజాపుష్పసంపాదివై
తుద లార్ద్రమ్మగు మూర్ధజాళి విడిపోఁద్రోవన్ గరం బెత్తి, నా
యెద కానందముఁ గూర్చు లక్ష్మి విడిపోయెన్ నేఁటికిన్ నాఁటికిన్

త్రోపుడు వెట్టి పాఁవెడు రురుల్ పులకింపఁగఁ బాడ చంద్రికా
స్నాపితరాత్రులందు తరుణమ్మగు నీ మృదుపాణి నా చెయిం
దోఁపికొనంగ మేమెయినొాదుంగుచు, నా యనురాగమూర్తిమ
ద్దీపికవోలె నెన్నఁడరుదెంచెదవో! ననుఁగూడి తోడుగన్

ఓ తేజస్విని! మౌనమోహనమ యయ్యున్ నీదు నెమ్మోము, నీ
నాతిక్రాంతశరీరశోభ లతిసాంద్రంబై ననుం గప్పఁ బ్రే
మాతిథ్య మ్మొకయింత కానపడి, సాయంవ్యాప్తమౌ దేహవ
ల్లీతారుణ్యముతోడ రమ్మనెద, కేళీలోలవై యుండఁగన్

ఆబద్ధం బయినట్టు ఏ చరమసంధ్యారాగసూత్రంబులం
దో ఎంబోష్ఠి! విశాలపర్ణకుటి స్నాఁయుచ్ఛేదమై, పంజరం
బై, బాధాజనకమ్ముగాఁ దలఁతు, ప్రేమాశ్లేషబంధమ్ము లీ
లాబాహ్యమ్మయి యేఁగుచో జగములెల్లన్ శృంఖలాకారముల్

# పుస్తకసాంగత్యము

పాడువడిన కొండల సమీపమునఁ బాఱు
కృష్ణవేణీవిపాదసంగీతగతులు
నవ్యసరణి జాతీయగానమ్ము సేయఁ
దలఁచు గీతాకుమారునిఁ బలుకరించె

'సుకవీ! వెన్నెల లంతరించెడు, తమస్సుల్ కృష్ణపక్షమ్ము లె
ల్లకడల్ నిండఁగ విప్పుచున్నవి; పొలాలన్ జెల్లుపూల్ కానుపిం
పక ధ్వాంతమ్మున మాతృశాదముల క్రేవ స్నల్లనై పోయె, తా
రక లాలాపము సేయు గానముల సారస్యమ్ము నాలింతువా'

కోరికలఁ జిక్కువడిన మూర్ఖుల మనమ్ము
లలఁచు నార్తుల సందేశములను వినక
ప్రకృతిగంభీర మయిన శ్రావ్యస్వరమున
హృదయగీతిక నతఁ డెలుఁగెత్తి పాడె

శ్రావణనీరదాంగనల చక్కఁదనమ్ములఁ జూచి కన్నెపూఁ
దీవ తటిల్లతాభినవదీప్తుల నొందు భయమ్ముఁ గాంచి, యే
వో విహగమ్ము లాటవికబోధల గానములం దిమిడ్చి, యాం
ధ్రావళి కొక్క ప్రీతివినయమ్మగు గీతము వాడు తోఁటలన్

శిఖరశిఖరమునుండి వచ్చెడు వినూత
నోదయం బార్ద్రమయ్యె జ్ఞానోదయమున
తారకలకన్న కడు నక్షతంపు నుడుల
మంచి చదువులు మమ్మావరించు నిపుడు

పడవలను గటికచీకటి నడువఁ జేయ
కీర్తిదేహుల ప్రణయసంకీర్తనములఁ
బుస్తకంపు చైతన్యసంపుటము లెల్ల
విప్పి చదివింత్రు యౌవనవీధులందు

వేఱు వేఱు రీతుల నాత్మపారవశ్య
మందు పనికయి పాడెడు పాటలెల్ల
ఏకమయి, నేఁడు మంగళమృదుల మయిన
ఉదధి సంగీతసాంగత్య మూనఁగలవు

## పృథివీప్రశంస

ఓ విశాలావనీ !
శోభాతిపావనీ !
ఆరంభపుణ్యక్షణముల నీశుఁడు విసరిన నాఁటి
నీయాది సౌభాగ్య మెటుల వెల్గెనో ? భవదీయశాటి
ఆకుపచ్చని యాకులో
పండువెల్తురు రేకులో
నిన్ను ప్రశ్నింపఁగాఁ జాల, నీనాఁటి ప్రొద్దుటిపూఁట
గంభీరమై ప్రవహించె నీదు సౌందర్యంపు పాట
ఓ విశాలావనీ !
శోభాతిపావనీ !

కాంతికల్లోలినీ !
వైభవశాలినీ !
సీతాసతీవేణి నడఁగి వాడిపోవని పూవుఁ బోలి
దినదినాపూర్వమై పొడుచు తావకీనవిభాతకేళి
ప్రాభాతగానమ్ము లా ?
నీ యస్తమానమ్ము లా ?
ఏవి సుందరతరమ్ము లౌకొ ? యెట్టి గీతాపరీమళము
ఆనందవీథి నాడించు నీ హృదయసరోజదళము
కాంతికల్లోలినీ !
వైభవశాలినీ !

ధవళయశోవతీ !
స్నిగ్ధతేజోవతీ !
పాటెడు కాల్వల చెంత పీచెడుగాడ్పుల వినుచు
నీ యుదాత్తలలాటరేఖ పులకలు సూప కన్గొనుచు
త్వత్కాయమానమ్ములై
శ్యామాయమానమ్ములై
దవ్వులనున్న వెదుళ్ళు కలసి కంఠము లెత్తిపాడ
తల్లి ! నీ యొడిలోన నడఁగి యల్లరిలేక విన్నాఁడ
ధవళయశోవతీ !
స్నిగ్ధతేజోవతీ !

హే నవమోహినీ !
హే దయావాహినీ !
చూడ సుందరములై యడరు నా శృంఖలమ్ములఁ ద్రెంచి
నా మేలి వాకిళ్ళ దాటి, విందు నీ మధురవిపంచి
బంగారు తోరమ్ములన్
నా రత్నహారమ్ములన్
గైకొని నాకిమ్ము జనని ! నీ మృత్తికారేణుకణము
శాద్వలశ్యామవీథి వికసించు పచ్చప్రాంగణము
హే నవమోహినీ !
హే దయావాహినీ !

# క్షణిక ప్రేమ

స్వప్న తేజస్విని! వినిపింపఁ బోవు
స్వచ్ఛమైన నా ప్రేమవాసనలలోన
క్రొత్తఁదనము లేదని దిగులుఁ గొనఁబోకు
చెదరె లజ్జచే మదుదారహృదయపదము

పూముసుఁగువోలె నీ దేహమును చలించు
స్వాదులజ్జాప్తి లేదు నా మీఁద నేఁడు
సిగ్గఱితి నింత నీ వయోచితవిధమ్ము
లాలపించిన గీతి వ్రాయంగలేక

మధురమై నిరాకారమై మానవాను
రాగరేఖాకళంకభరమ్ము కాని
ప్రణయభావన తెలుఁగెత్తి పాడలేక
పలుకలేని పూవులవోలె కళవళించు

## సోదరస్మృతి

(కవికొండల సాంబశివరావుగారిని గురించి)

ఈ హేమంతనిశీథమున్ విడిచి యేయేత్రోవలం దీశ్వర
స్నేహప్రాప్తికి పైనమై నుతవయస్వీ! యేఁగుచున్నావొ ? తే
జోహీన మ్మగు సోదరాంధ్రుల ప్రశంసారంగమందున్, యశో
దేహమ్మందున నున్న నీ కివిగొ మా దీనప్రణామావళుల్

వెడలితి స్వర్గరాజ్యపదపీస్థలిఁ జేరఁగనెంచి, లోకపుం
బడలిక లెల్ల నీ దివిజభారతి చల్లెడు కాంతిరేఖలన్
విడివడి నీ శుభాత్మ కొక వింతవిలాసము నీయ, నేఁడు మా
పడెడు నవస్థ నీ నిశితబాంధవవృత్తము నాశ్రయింపఁగన్

మాలోన వెలిఁగింపఁజాలిన నీ ప్రేమ
భావాగ్నిశిఖ లారిపోవనీక
పాడఁగా నేర్పిన భక్తివీణావాద్య
తరళగానము శ్రుతిఁ దప్పనీక
సేవానురాగభద్రావాప్తికై లేచు
నాశాంకురములఁ గోయంగనీక
పూర్ణనదీశాంతమును బోలు నీ స్వాంత
నైర్మల్యసంస్మరణమ్ము విడక

నీ మధురతేజోరూపసీమఁ దలఁచి
నీవు మొదలుపెట్టిన యక్షరావళులను
గూర్చి యల్లెద మింక మా నేర్చినట్లు
మానవప్రేమ పూర్ణనిర్వాణగీతి

# ఆంధ్ర వీర కంఠీరవ

(కోడి రామమూర్తి)

**1**

నీ యశఃపారిజాతమ్ముల మాల
ఆంధ్రమాతృగ్రీవమందు ముత్యాల
హారమై వ్రేలఁగా
తారాళి దూరమై తూలఁగా
చేరి పాడెదము నీ గౌరవగీతి

**2**

అడవి పూవులవోలె నజ్ఞాతసీమ
నడఁగిన నీ శౌర్యసాధనాప్రేమ
ఎంత గభీరమో?
చూచిన నెంత యపారమో ?
చాటింతుము విశాలమానవవీథి

**3**

నీ విజయపతాక మూడెడు చోట
ఆంధ్రదేవి ప్రసన్నయై పాడు పాట
నవ్యశోభాప్తిచే
శాశ్వత దివ్యసందీప్తిచే
మ్రోఁగెడిగాక! యాశాభిత్తు లదర



6

4

బాహ్యదేహపు చక్రవర్తివి నీవు
ఆత్మప్రఫుల్లత నార్జించినావు
అన్ని విధంబులన్
నీవేఁగు చున్న పథంబులన్
ఆంధ్రావని శరీర మాత్మయుఁ గదలు

5

ఆంధ్రతపస్వినీ ఘనతమో రాత్రి
నేతెంచు శుభ్రతేజోలోకయాత్రి !
ఏ శుభాహ్వానము
నాలించి యాశింప మానము
ఔన్నత్య మార్జించు నుత్తమబుద్ధి

# పూర్వప్రేమ

## పూర్వకథ

రాచబిడ్డఁ డగు లక్ష్మీంద్రుని వంశీయు లందఱును రౌద్ర రూపిణి యగు మనసాదేవి యారాధకులు లక్ష్మీంద్రుని జనకుఁడు మాత్రము వంశమునుండి వంశమునకు ధారావాహికముగ వచ్చుచున్న యీ దేవీభక్తి నిరాకరించి మనసాదేవికి పూజాంజలి నీయమానెను. ఆపె తన యాగ్రహజ్వాలచే నతని ననేకవిధముల సంక్షోభపెట్టెను. కాని యతని మనోనిశ్చయ మేమాత్రమును క్షీణింపలేదు చివరకు లక్ష్మీంద్రకుమారుఁడు వివాహశోభనవేళ రాత్రిజామున సర్ప సందష్టుఁడై మృతినొందునట్లు శపించెను. శాపబాధ నివారించుటకై సర్పప్రవేశమున కసాధ్యమగు నినుపమేడ నిర్మింపఁబడెను. సర్వజ్ఞయగు మనసాదేవి దానిలో నొక రంధ్రముఁ గల్పించెను. ప్రకృతమిందు లక్ష్మీంద్రునియొక్కయు, అతని ప్రాణసఖియగు వేహుళయొక్కయు ప్రేమానుభవమును, దాని విషమపరిణామమును వర్ణింపఁబడినవి. వేహుళ సావిత్రివలె తన ప్రాణపతి జీవితమును ఇంద్రుని రంజించి తెచ్చుకొనుటకై, మనసాదేవీప్రశంసావాక్యము లను చదువుచు ధ్యానించుచు పయనమైపోవు భాగము అసంపూర్ణముగ విడువఁబడినది.

# పూర్వప్రేమ

## 1

"వెదరెడు పశ్చిమారుణవిచిత్రములం గ్రసియించె చీకటుల్
తుదిమొదలేకమై సొగసుతోఁటలలోని కదంబశాఖికల్
వెదకినఁ గానరావు; వెడవీడని సిగ్గుల నివ్వఘాకుమా
రి దరియవచ్చె నేగతి వరింతువొ ? పెండ్లికుమార ! బాంధవిన్

"నీ మహనీయమూర్తిపయి నిల్పె నెవండు వయోనిలీనరా
గామృతశుభ్రరేఖ సుభగాకృతి, నా మహిమాంకమోహనుం
డీ మృదుముగ్ధవాదినిపయిన్ నిలిపెన్ భవదీయకామ్యలీ
లామధువున్, భజింపఁగఁ దలంతువొ ? సిగ్గున నొల్కఁబోసెదో?

"పడుచుఁదనము నొయ్యారపు టొడుపు లెన్నొ
చిలుతసౌందర్యమునఁ బడి చిక్కువడెడు
నీ ముఖమ్మున లక్ష్మీంద్ర ! యీ మనోజ్ఞ
వదన వేహుళఁగొను మది పాయఁగలదు

"లీలాతల్పమునందు శ్రావణపథక్లేశమ్ములం బొంది, ని
ద్రాలాభమ్మును గోరు మేఘసుతు మీఁదన్ వ్రాలు సౌదామినీ
బాలారత్నమువోలె శ్యామలుఁడ ! యీ ప్రాయస్సతీనూత్నశో
భాలక్ష్మల్ ధరియింపుమోయి యిఁక నీపై క్రొత్తమోదమ్మునన్"

ఈ విధానఁ జక్కనినుడు లెఱుఁగఁ జెప్పి
వృద్ధనారీతపస్విని వెడలిపోయె
నా యపూర్వమగు నయోగ్యగృహమ్మునందు
పలుకకయె భావమెఱుఁగు దంపతుల వీడి

నకనకల మండుచున్న దీపిక వెలుఁగున
యుగపదున్మీలనము లయి, యూహ లెగసి
సొంపు లెండింపఁ బెదవి బిగింపుఁ గనియె
వేహుళముఖమ్మున సుభగదేహుఁ డతఁడు

పెదవుల కందునట్లు కనుపించిన మోహనపాత్ర దూరమ
య్యె, దెసలుసూచు నా వయసుటింటికి నా తృటిలోన పట్టుప
య్యెదపయి వ్యక్తమౌ హృదయవృత్తములం బరికించు స్నేహితున్
బెదరిన లేడివోలెఁ గనువిచ్చి కనుంగొని వాల్చె ఱెప్పలన్

ఆ యకలంకమూర్తి వినయాతిమనోజ్ఞము లైన చూపులం
దోయిలు లెత్తి త్రావుకొన నోఁచిన భాగ్యకుమారుఁ డార్ద్రవా
ణీ ! యని మోమునెత్తి యటనిల్పె మనోహరకుంకుమాంక మా
త్మీయపు రక్తిరూపమునఁ దీర్చినటుల్ సుకుమారి నవ్వఁగన్

పదపడి యా స్మితలీలా
విదితవదన, కోరికల్ కవిసి తీంట్రడింపన్
వదలని పులకితలజ్జా
వదాన్యములు నయిన శ్రావ్యభంగుల ననియెన్

ప్రాణములేని దీర్ఘపుఁ బురాణము లేల పఠింతువో, జపా
శోణములైన కుంకుమరుచుల్ తిలకమ్ముగ దిద్దితేల ? వి
న్నాణపు వన్నెకాఁడ ! యిటు నాఁచికొనం దలఁపేల బాలికా
శ్రేణుల మౌగ్ధ్యముల్ కడు విచిత్రము లయ్యెడు యౌవనాతిథీ !

అనుటయు నతండు వలుకు "కల్యాణి ! వినుము
కడ లెఱుంగఁగఁ జాలని కలకుగతుల
హృదయ పారావత మ్మెగిరి చనకుండ
నాశ్రయ మొసంగు నా కులాయమవు నీవు

"వేసఁగి సంజలందు పురివిచ్చిన తెల్ల మొయిళ్ళ గుంపులన్
డాసి మెఱుంగువెట్టెడు దినప్రభుకాంతుల వోలె వైభవో
ల్లాసిని ! నా మనోనియతులన్ గదలించి పసిండిపూఁతలన్
వ్రాసితి వందు నీ యమృతరాగకరంబితచారుమాలికల్

"వాడితలంపులే పడుచువాని నవోదితభావరక్తి రా
పాడు కరాళవేదనల బంధురమయ్యె కటాక్షమోహన
క్రీడలఁ జేర్చికొన్న యొక ప్రేయసికై, యతఁడో శుభాంగి ! నీ
యీడున కాసపెట్టి కొనియెన్ , సరళమ్మగు నీ రహోనిశిన్

"చేయితగలని పూవుల తీయఁదనము
ఉదయగర్భిణి యగు తూర్పుముదిత చెలువు
మాసిపోని నా ప్రేమసుమము సరళత
వలచి నిన్నోముకొనియె వేహుళ ! వసింప

''కనులెత్తి కటాక్షింపుము
మనోనిశిని వెలుఁగు చందమామరా ! నీలో
ని నిజమును వచియింతే ? నా
యనుఁగుంజెలి నాదు సర్వ మగుదో కావో ?''

ఆపఁగరాని ప్రేమ నిటులాడి మనోహరిఁ జేరి, స్వీయబా
హాపరిపూతయౌ సుదతి నక్కునఁ జేరిచికొన్న పల్కులన్
దీపి తొలంగ జీవితపతీ ! సతమున్ భవదీయ నౌచు ని
దాపునఁ బ్రాణముల్ నిలుపుదాన నిజ మ్మని పల్కె నాపెయున్

అనవిని పల్కె నాతఁడు "వరానన ! కుంతలపాళిలోన నై
ల్యనిబిడ నీరదమ్ముల కలాగరిమమ్ముల దాఁచి తెచ్చినా
వౌ ? నలిగియున్న నాదువలపుల్ మొలిపింపఁ దలంచి? లేకయుం
డిన సుఖనీయశైత్యము గడించితి వెచ్చటనుండి కౌఁగిటన్

''కాటుకకండ్లు చీకటులు కప్పఁగ, నీ తెలిచూపువెల్తురుల్
నాఁటుకొనెన్ మనమ్మున, ననంతర మా తమికాఁకచేత ద
గ్ధాటవులట్లు వాంఛితము లన్నియు వాడులువాఱె; గర్భితా
రాటము లౌనె ? నెయ్యము తెఱంగులు హెచ్చిన మోహవేళలన్

''ఒకనిముసమ్ము నీయెద వియోగము నోపఁగలేని కాంక్ష నూ
రక రమణీవిలోకనపరాయణతన్ ననుఁ ద్రోసెదేల ? క్రూ
రకృతుల కగ్గమై మనసు రాలుపడంగ వయస్వినీ ! వచిం
పకు మొకమాట నీ కనుగవన్ ముకుళింపు వివిక్తశాంతికై''

అను నుడు లంతకంతకు రహఃకలగీతల తున్కలట్టు లం
దనివయి యాగిపోవుటయు, నగ్నమనోమిళితార్ధ్రరాగముల్,
తనివి సనన్ భుజించుచు నితాంతమనోహరమైన యొంటిపా
టున శయనించి రంతఁబ్రియుఁడున్ బ్రియురాలు నయోగ్యహమ్మునన్

క్రమమున రెండుయామముల కాలము రాత్రిగతించె లోకమం
దమృతకరోదయమ్ము తెలియన్ జనుదెంచెను దూతవోలె రం
ధ్రము నొకదానినుండి కిరణ మ్మొకఁ డాగదిలోని నేలపై
తెమలుచునుండె పాండువయి తెల్లనిసర్పము ప్రాఁకు పోలికన్

మెలఁకువం గాంచి యపుడు లక్ష్మీంద్రుఁడు తన
యడుగులకుఁ జెంత నిద్రవోయెడు పడంతి
మేలుకొల్పుచు కించిదున్మీలనేత్ర
కనియె వేహుళ కిటు స్వప్నమయిన రుతిని

''మదవతి ! పల్కఁబోవునెడ మాట తడంబడు నేమొ ? నిద్రపో
నొదవదు బుద్ధి , యేదలనో పొడసూపదుకాని ఏతి కా
స్పదమయి వేదనాచకితభావములన్ వెలయించు బాధ వీ
డదు తనువున్ ; మహేమనఁగ దప్పి జనించెడు నాల్క నీడ్చుచున్

నీరముఁ ద్రావఁ గోరిక జనింపదు , తీయని పాలతోడ చ
ల్లారదు వేవిధాల నుడుకారెను నీ యతితృష్ణ పల్లవ
శ్రీరచితాంగి ! నీ యనుఁగుఁ జేతులతో నొకకొంత వండినన్
చేరెడు పానకమ్మును రుచింపఁ దలంచితి వింతవేడుకన్''

చిటిలిన జేకులన్ విరియఁ జిమ్మెడు గాడ్పులలోని పూవులై
కుటిలవినీలకుంతల చిగుర్నగుమోడ్పు లయాచితవ్యథా
జటిలత విన్నఁబోయె, తన చాయ శయించిన నాదు మేన స
క్కట! పరికించె నాపె కసిగాటులువడ్డ వయోవికాసముల్

చూచి శ్రవోమృదుప్రణయసూక్తుల నిట్లను స్నేహవాసనల్
దాఁచికొనంగ ప్రేమయె నిదానముగాఁ దలపోసి "కార్శ్యశో
భాచితరూప ! యిప్పుద నివారణనొందెడు నీదుతృష్ణ నే
నోఁచిననోము లన్నియు మనోజ్ఞములై ఫలియించునేనియున్"

అని వచియించి వేహుళ యయోనిలయమ్మున నెల్లెడన్ పునః
పునరుదితమ్ములైన తలఁపుల్ నిలుపోవఁగలేక వంటకున్
ననువగు మంచివస్తువుల నాలుగు మూలలఁ జూచి యొక్క తీ
రునఁ గనదయ్యె నెంటు ననురూపములై తగు పాకపాత్రికల్

ప్రేమదీపికఁ గొనిన పుత్రికల నెవ్వ
డందని నిరాశ దుఃఖాన నడచి చనియె
ప్రేమచే శుష్కమై పోవు హృదయములకె
చేయఁ జాలని పనులె తోఁచినవి గాక

నారికేళఖండంబె పానకపుఁ బాత్ర
గాఁగ నా యింటిమూలల దాఁగియున్న
చినిఁగిపోయిన బట్ట లింధనము గాఁగ
రాత్రివేళ నాసతి ప్రొయి రాజఁ జేసె

"అంతయును సొంతమయ్యె, నా యనుఁగుకాని
మ్లానముఖబింబము ప్రఫుల్లమౌ" నటంచు
ఊహపై లేచు తీయని యూహలందు
మునిఁగి కనలేదు తనకు రాఁబోవు వగల

ఇదివరకున్ మహీస్థలిపయి న్నటియించుచునున్న చంద్రికా
మృదుకిరణమ్ము తోడనె యదృశ్యమునొందె తమంత నెవ్వరో
యదిమి బిగించినట్లు వివరాకృతి ; వెన్కకువంగి యాపె మే
నొదిగియొదింగివచ్చు మలినోరగముం గనియెన్ వివర్ణయై

అలలులేని సరోవరజలమునందు
తొడిమ తెగిపో నుపాంతపు ద్రుమఫలంబు
పడినయట్టులు ఝల్లున వడఁకఁ దొడఁగె
నా సతీమణిదేహ మాద్యంత మపుడు

నల్లనియందముం గల మృణాలము పోలిక కాంతిమత్తనూ
వల్లి నొకింత సోయగపు వాలుపులన్ వెలయించి, నాల్క ల
ల్లల్లన చాచుచున్ తరళితాక్షుల చంచలకాంతి చెంపలన్
వెల్లువవారఁగాఁ బడగవిప్పుచు వాల్చుచు నన్నగిల్లుచున్

తీర వర్షించిన గరళధార యనఁగ
జాఱిపడె క్రింద సర్పశరీరమెల్ల,
ముడివిదిర్చిన యలివేణి జడ విధాన
పడగవాలిచి యటునిటు ప్రాఁకఁదొడఁగె

చేతఁ గలంచినట్లు వగఁజెందిన నెమ్మది పిక్కటిల్ల నా
రాతిరి జామునం దొరుల రాక పొసంగనిదొ కెటింగి చిం
తాతిమిరమ్ము ధీరమతి నాఁచికొనంగ, తలంపు లెల్లెడన్
రీతులఁ దప్పిపో నిలువరించుచు కొండొక నిల్చి యాపెయున్

చెమ్మట గ్రమ్మ చేతితడిచే స్పృశియించిన రాక, జాఱు పా
త్రమ్మొకదానిఁ గైకొని లతాలలితాంగి ద్రుతమ్మ దాని పూ
ర్ణమ్మొనరించె పానకమునన్, పసిపట్టి తదీయరుచ్యస
త్వమ్ము సమీపముం దరియవచ్చె విషోరగ మల్లనల్లనన్

ఆకలిదీర పానకము నానెడువేళ పదంతి వస్త్రమున్
జేకొని చించి పేలికలఁజేసెఁ దనంత, కరాళకాలద
ర్వీకరకంఠగోళమును పేనిన త్రాట బిగించివైచె చీ
కాకున పాపఁబుర్వు తనుకంపమునన్ మరణింప , నంతటన్

తూలిన బిసియూరుపులన్
చేలాంచల మడ్డమై మిసిమి శశిరేఖన్
చాలించిన వేహుళ స్మయ
లీలార్ద్రశరీరయై నిలిచి పులకించెన్

వ్రీడామౌనవచోనుభావములఁ దప్పింపన్ వ్యథావ్యాకుల
క్రీడల్, నాధునిఁ జేరఁగా నడచి, యార్ద్రీభూతచేతోగతిన్
వాడుల్వారిన మోమునన్ తనదు ఖిన్నమ్మైన నెమ్మోము క్రొ
న్నీడల్ గప్పుచు నిద్రలేప నరయున్ వేళన్ ప్రకంపాక్షియై

తెగిపడియున్న వ్యాళము నతీవకఠోరదవాగ్నిఁ గ్రక్కు దం
తగరళరేఖ లన్నియుఁ గనంబడ నోరు మెదల్చి చూచి పై
కెగయఁగ రోషవాయువుల నెత్తి విశాలముఖమ్ముతోడ చే
రగఁ జనుదెంచు సర్ప మెదురం గనె నింకొకదానిఁ జేరువన్

మునుపటివలె నాశీవిష
మును జేరఁగ నరిగి కంఠమున కురివైవన్
క్షణమాత్ర మవయవము కం
పన మొనరిచి చచ్చె ప్రాణబంధము లూడన్

ఆదట నొండురెండయి త్రయిమ్మయి నాల్గయి లెక్కలేని మ
ర్యాద విషాననమ్ములఁ దొఱంగెడు చిక్కని వేఁడియూర్పులం
దూఁదెడు తిత్తులంబలె రవోద్ధృతి రేఁగఁగ చుట్టుముట్టె నా
పేదమనమ్ముతోడ విలపించెడు కష్టకుమారి చేరువన్

కృతతీర్థమ్మని స్నానమాడఁగ తరంగిణ్యంతరాకర్షణా
ర్దితుఁడై యాత్రికుఁ డూర్మిమాలికలు గర్జింపన్ నిరాశాహత
స్థితిఁ బ్రాణమ్ముల నాస వీడ్కొలుపు రీతిన్ సర్పమాలాపరీ
వృతయై మిన్నకయుండె వేహుళ మనోరేఖల్ విలాసమ్ముగాన్

మనసెటులు పాలుబోక యా ప్రణయపుత్రి
కలఁతనొందిన మనసు చీకాకుపడఁగ
స్తబ్ధయై విగ్రహాకృతిఁ దాల్చి నిలిచె ,
అంతఁ దిలకించె విభుని పర్యంక మపుడు

ప్రాణపతి శరీరముపైనిఁ బ్రాఁకుచున్న
త్రాఁచు లగపడె వేహుళ ప్రాణమపుడు
వేయిపాములు కఱచిన విధి వడంక
ప్రియుని శయసీయమును సమీపించె త్రుటిని

పాముకాటున నిద్దుర భగ్నమగుడు
మేలుకొను సుకుమారలక్ష్మీంద్రసుతుని
లేవఁగాఁ దీసికొని కౌఁగిలించుకొనియె
నా వయస్వి క్షణక్షణ మడఁగి యడఁగి

తొలఁగెడు నీలాలకలలోన మణఁగిన
ఫాలపీఠిక పైని పసిఁడిరేఖ
కోరకస్థితి సుకుమారమ్ములౌ కల్వ
పూలఁబోలు కనుల మోడ్పు సొబఁగు
చెమటచిన్కులు లేవఁ గమలి ప్రేఁగైన చె
క్కులమీఁద వ్రేలెడు మలినశోభ
బరువైన సామ్రాజ్యపదవి మోసెడు పాణి
గదితమైన మృణాలమృదులకాంతి

మొదటి చెలువమునకుఁ గ్రొత్తమూర్తి యొసఁగ
నల్లికొనిన తీవియతోడ పెల్లగిలిన
బాలసహకారతరు వన నేల వ్రాలె
వేహుళ కవుంగిలింతలు వీడిపోవ

పైఁట చెఱఁగును దేటపన్నీటఁ దడిపి
యంటియును నంటకుండ నయ్యబల సేయు
చలువఁ దగిలిన యమృతోపచారములకుఁ
దేరుకొనఁడు లక్ష్మీంద్రకుమారుఁ డంత

నిశితభావానురోధబాలిశము లైన
చిత్తవృత్తుల భయము రేకెత్తకుండ
నా చకితనేత్ర శోకము నడఁచికొనియె
నడఁపలేక యడఁపలేక గడియప్రొద్దు

దర్శనీయము లైన బాధావినమిత
చక్షువుల నెత్తి ప్రేయసి చాయఁ జూచి
పలుకఁబోయి నాలుకవెంటఁ బలుకు రాక
తొట్రుపడెడు కంఠముతోడఁ దొడఁగె నతఁడు

'నా'యని 'వేహుళా'యని యనం గనుదోయి తనంత నశ్రుధా
రాయుత మయ్యె, చేత చికురమ్ములఁ ద్రోయుచు మోమువంచి 'యే
మోయి' యటంచు నామె కొనలెత్తఁగఁ బోవఁ గనుల్మొగిడ్చె, నా
రాయిడివేళ మృత్యువు కరమ్ముల నాతని యాత్మ ప్రాలఁగన్

అంకమునఁ జేర్చి పతి యుత్తమాంగ మంత
వక్షమునకు వక్షముఁ జేర్చి వలపుచే క
వోష్ణమగు హృదయమ్ము రాయుటయు నంత
'వోయెనె నిధాన'మని సొమ్మవోయి లేచి

## 2

శోకపరాయణ యయి యా
కోకిలమృదువాణి మది దిగులు కదలుకొనన్
వాకొనుచు నేడ్చె నిట్టు లే
కాకి యగుట దుర్వ్యథావికలకంఠమునన్

"ఏ నెఱుఁగ నెంత కట్టిడి
దాననొ ? పసుపిచ్చునెడ విధవతనపు వగన్
నా నొసటఁ ద్రోసిపోవునె !
నోనేసి విధాత నా మనోహర ! నిన్నున్

ఓ మధురహృదయ ! యేమని
నామది విలపింతు నీక్షణము నీ యెదపై
ప్రేమఁ జవిఁగొనుచుఁ జింతా
శ్యామలలోకమున నిఁక విసపుఁ బ్రదు కీడ్వన్

త్యజియింపవు నీ పెదవుల
సజీవకళ లింక నయనచంద్రికలను మా
పు జనింపదు; మృతినొందుట
నిజమో ? నను నవ్వఁగా గణించు సరణియో ?

చిరిగియుఁ జిరుగని లజ్జా
పరాఙ్ముఖత నన్నుఁ బిలిచి పలికించితి వో
తరుణవయస్కుఁడ ! హృదయే
శ్వరియె నినుం బిలుచ మాఱుపలుకమి చన్నే ?

నాకయి మోమునఁ గుంకుమ
రేకలు నీ వ్రాసినవి చెఱిగిపోవు సతీ
వ్యాకులత కోర్చి యీలో
నేకాంతనిశీథ మెచట కేఁగితివోయీ !

తామరపాకున జలము
క్రామణివలె నాకు ని వికాస మొసఁగి, యీ
వే మరణించితివే ? యిం
కేమనియెద నేలపాలయిన నా బ్రదుకున్

త్రోపువడియు నా చేతుల
నా పాపపు సర్ప మంటదయ్యో ! క్లేశ
మోర్వని ప్రాణము లెంతటి
తీపో ? కరినాజ్ఞలిడు విధికిఁ దలపోయన్

నియతోన్నతపదవిన్ సుఖ
శయనీయమునందు నిద్రసలిపెడు నా మో
హాయశోధుర్యుని తారుణ
వయస్వి బ్రదికించువా రెవరు నా కింకన్ ?

పతి మరణించుట యాతని
సతి వైధవ్యమునఁ దా మసలుచుండుట యీ
వెతలు యథార్థము లెందును
హతాశులకుఁ గుదురు నాయురారోగ్యంబుల్

నాగావతంస ! ప్రియుని న
నాగసు హరియించి యమున కందిచ్చితి వీ
యోగవియోగిని నను( గొని
పో(గల విటు రమ్ము విసపుముద్దిమ్ము దయన

నా విలపించె నంత( గరుణమ్ముగ, నా(టి వివిక్త యామిని
దేవియు తద్వియోగవినతిం గని జాలి వహించినట్టు లా
రావ మొనర్చె నాపె విధురవ్యధ కిచ్చు ప్రతిస్వనమ్ముననన్,
లేవవుబో విహంగయుగళీరవమల్ తెలవారకుండుటన్

దరణితలీవిలాసము హతత్విపమయ్యె( దలంప నత్తలో
దరి కొడ(గూడు నొక్క ప్రియధర్మము కర్మగతమ్ము గా(గ నం
బరవిరళమ్ములైన చెలువమ్ముల( గోరక యొక్క( డా సుధా
కిరణధరుండు వోయిన సఖీకమలమ్ము జగమ్ము నూచునే ?

వేహుళ యంకముం దిగిచి ప్రేయసునిన్ శయనీయమందు నా
రోహితు( జేసి వాకిటి మరుంగుననుండి దృశించె స్వీయశో
భాహరితమ్ములౌ ధవళవారిదఖండము లాకులప్రభా
వాహినులందు( దేల్చి చలువల్ వెద(జల్లెడు శీతభానునిన్

ఎదియు లేక శూన్యమునొంద హృదయ మంత
గడియద్రోసి వాకిట నున్న గడపపైని
పాడువడిన లోకమునందు( దోడు లేక
చదికిల(బడె వెన్నెల(గాయు చదల( గనుచు

దృఢతరమ్మగు మేఘపంక్తిని స్పృశించి
కొనల వెలిఁగించు వెన్నెల కుంచియలను
లేకయుండిన ప్రత్తిపేలికల వంటి
తెలి మొయిళ్ళ డాఁగుచు శశి వెలిఁగె నపుడు

సాంద్రముగ రాలుచుండె తుషారవర్ష
మంటు తగలని చంద్రిక లవలఁ ద్రోసి
మాపువడిన జ్యోత్స్నల నియమమున సేక
రించి ధారుణిపైనఁ జల్లించునట్లు

కాని కనలేద ఆ సుమగాత్ర యీ వి
కాససౌష్ఠవమును, పల్కె గద్గదికను
"హిమరజోమలినము లయ్యె నమృతకరుని
కిరణసూత్రము లీ పాపకరపు రేయి

చిటిలి పీడిపోవు చిన్ని మొగ్గలరీతి
కలఁతనొందె నాపె యలఁతి మనసు
శోకవివశమయిన చూపున కాపెకుఁ
గానరాదు సౌఖ్యగగనరేఖ"

పాయలై చీలిపోవు నభమ్మునుండి
తెగిపడినయట్టి తరుణదుగ్ధిక లనంగఁ
బొలిచె నిభృతములగు లతావలయముల న
లంకరించెడు స్వచ్ఛహిమాంకతతులు

కూఁతవ్రేటు దూరమునందు మ్రోఁతవెట్టి
పాఱుచుండె గంగానదీక్షీరజలము
తన నతోన్నతహృదయవృత్తముల తెఱఁగు
లెలుఁగు లెత్తఁగ విన్పించు నులివు లనఁగ

బహిరుదయశోభనమ్ములు
రహోజ్వరపు టార్తికిన్ విరసకారణమై
దహియింప మనోనాథ వి
రహవేదన కస్తికిన్ కరఁగు నెమ్మదితో

అక్కట ప్రాణమిత్ర! నిను నాఁకట సోలినవాని దప్పికిం
జిక్కినవాని కేమియును జేయఁగనీయక, యీ తపించు నా
కెక్కడి దైవ మడ్డుపడియెన్, మన సిచ్చకొనంగ రాని యీ
కక్కురితిన్ భరించికొనఁగా నెటు లోర్వఁగవచ్చుఁ జెప్పుమా!

వలపు కౌఁగిలింతలను సంకెలలు గాఁగ
కఱకుగతిఁ ద్రోసి మృత్యుశృంఖలల కెటుల
వశుఁడవై యేఁగి తీ లేఁతప్రాయమందు?
కరినసిద్ధాంతముల నెఱుఁగని వయస్వి!

"నీ కనుదోయి విప్పవడ నేరమినుండియుఁ జూడు మశ్రుధా
రాకలుషాంకితమ్ములయి రాగము దప్పిన నాదుచెక్కు లెం
దాఁక తిరోహితుండ వయి నా వెతలన్ సహియింతు వంతక
స్వీకృతరూప! వచ్చి నిలిపింపుము నా పరితాపతాపమున్

''వాచవియంచు నీ కిపుడ వండితి పానక మారగించిపో
మోమ్మ చెలికాఁడ! చక్కఁదన మొప్పెడు నీదు కటాక్షరేఖకై
వేచితి నింతదాఁక , వినివింపకు వేఁడెద నిన్ను ; నా కనుల్
వాచెడు ఏ సితస్మితవిలాసములం గనులార చూడఁగన్''

ఏలికనెంచి యిట్టు లెలు గెంతయు వోవఁగ నేడ్చె , నెమ్మదిన్
వ్రాలని తీవ్రవేదనలపై పరువెత్తెడు కాలపక్షముల్
వ్రాలకపోవుగాన తెలవాఱె సుధాకరమూర్తితోడ నా
బాలికయున్ వివర్ణయయి పాండురపత్రమువోలెఁ గంపిలెన్

చెలియల గుంపువోయి యొకచెంత లతాగతి వ్రాలిఁయున్న వే
హుళఁగని శోకతప్తలయి 'యో హతవైభవరూప ! నాఁడు పెం
డిలి జరిపించు వేళనె కడింది విషాదముతోడ నెల్లవా
రలుఁ గనరే యమంగళకరమ్మగు సూచన లార్తమూర్తులై

ఏ దెసనైనఁ గంటిమె సువృత్తమనోజ్ఞలు సాధ్వులైన ము
త్తైదువులందు ఫాలలలితమ్మగు కుంకుమరాగమే వివా
హాది శుభక్షణమ్ముల పయంట చెరంగున రాలిపోవ ? నేఁ
డీ దురవస్థ మాకు లభియించు టెఱుంగమె నాఁ డధోముఖీ !'

అనెడు వేళ లక్ష్మీంద్రుని జనని యపుడు
మొదటి దుఃఖపు జడివాన చెదరినంత
ననియె "కూఁతుల కన్న నీయందె యెపుడు
ప్రేమ కలదాన నెట్టులోర్చెద గతమ్ము ?

"శూన్యతేజస్వినివి నీదు శోకభరము
భగ్నయౌవనుఁ డీతని బాధ యనెడు
నెదురు ప్రవహించు రెండు వాహినుల నడుమ
పెనఁగులాడు నా మనసొక వృక్షమటులు"

కామినీబాష్పకలుషితగండతతుల
మలినమై తోఁచు దుఃఖతమస్సునందు
కాఱు మేఘావళి నెసంగు గగనరేఖ
వోలె వేహుళ కనె నొక్క పూలనేల

ఆ రమణీయరంగమున యందు మనోహరచంద్రచంద్రికా
పూరము బాహ్యసృష్టిపయి పుప్పొడిపోలిక రాలుచుండ రా
గారుణనేత్రముల్ తన హృదంతరమందలి గుప్తకాంక్ష వా
తేరితపుష్పరీతిఁ జలియింపఁగ ప్రేయసుఁ డిట్లు నవ్వుచున్

"నవ్వుల చిన్నదాన! విను నాలుక యెండెడు నీ వియోగపున్
రవ్వ వెలార్చు నుష్ణకిరణమ్ముల చేతనె డప్పివుట్టెనో!
యివ్విపినప్రదేశమున నేమియుఁ బుట్టదు నీదుప్రేమపుం
దివ్వె యొకండుదక్క కడతేఱుపు ముమ్మలికమ్ము దానిచే"

అను ప్రియునివాక్కు లందంద యాగిపోయె
కఠినసేవానురాగ మంగముల వెలయ
షౌనక మొసంగు కథ యవసాన మొందె
ప్రియుఁడు భుజియింపకే స్వప్నభిత్తి విఱిగె

అంత ననియె వేహుళ తన యత్తవైపు
కోమలతఁ దక్కిన ముఖమ్ముఁ గొంత యెత్తి
సర్పసందష్టులకు నవసానదశలఁ
దలఁపనగు నొక్క పూర్వనిదర్శనమ్ము

"మృతశరీరము దహనవికృతముగాని
తెఱఁగు నవయవతతుల బంధించి పుణ్య
నదులవైతు రదృష్టమ్ము నమ్మికొనుచు
తల్లి! కాంక్షింతు నట్టి యాదరమె పతికి"

అత్తయు సఖీజనమ్ము నయ్యతివ పలుకు
చతురమధురోక్తులకు సంతసమ్ము నొంది
అనఁటికంబాల లక్ష్మీంద్రు తనువు నునిచి
యా నదీతీరమును దరియంగఁ జనిరి

మరణతాపసి కప్పిన మలినవస్త్ర
మనఁగ, సన్నని యుత్తరీయము శరీర
మంతయు ముసుంగు వెట్ట, శయ్యాతలమున
వ్రాలియుండె లక్ష్మీంద్రుఁ డా రమణి యపుడు

అంధకారబంధురనిశాభ్యంతరమున
జాఱు నక్షత్రమనఁగ చంచలత గదుర
చిక్కువడిన శిరోజాళిచేత, కొంత
మఱఁగువడియున్న దేహకోమలత తెలియ

ప్రాణపతి యున్న కటకుకంబాల కెగయఁ
జేరి, యాసీనయై నిల్చె, నీరువంటి
మనసు గడ్డలుగట్ట, నాతని యురాన
హస్తములును, చూడ్కులు శూన్యమందు నిలిపి

తెలియలేరైరి చూచువారలు, విషాద
వేదనలనుండి వేహుళ చేదుకొనిన
వినతగాంభీర్యమును సత్యమును విరతియు
భ్రాంతియని, వెఱ్ఱియని వినఁబలికి రిట్లు

"మ్లానతాంబూలవల్లీ దళమ్ము పోల్కి
మృదులమై, స్నిగ్ధమై, బలహీనమైన
నీదు మనసు వివేకమర్యాద విడిచె
నాత్మపయి హరాత్సంభవమైన వగల

ఈయఁగలదె గంగానదీతోయరాశి
అఖిలలోకనియంత యుయ్యాలఁ బడిన
ప్రణయు నో ఖిన్నమూర్తి! కారణముఁ గనక
పాలకై చెట్టుకెక్కిన రాలఁగలవె ?

చూచునది మేము దుఃఖ మోర్చునది నీవు
వగపుచే మాసిపోని మా బాంధవోక్తి
వినుము, నాధునియెడ విడిపించికొనుము
పంజరమె చూడు మది, పక్షి వదలిపోయె"

వేహుళ వచించు "నో శుభవృత్తులార !
వేదనాదత్తమైన నా ఖేదబుద్ధి
నేల నిరసింప ? నిర్యాణనీలభూమి
నాదు హృది క్రొత్తయాశలఁ బాదుకొలిపె

ఏ గభీరపు టాధార మీ ప్రపంచ
మునకు నాకు సంబంధమ్ము పొందుపఱిచె
నది గతించె కామ్యప్రేమపదవులెల్ల
వెదకికొననిండు స్వచ్ఛందవీధులందు"

## 3

శుభ్రగంగానదీ భగవలి చేతి
బంతిపూవనఁగ నా పరితాపమూర్తి
వేహుళ వాహినీస్విన్నదేవి వలె
విరియజాఱిన వేణి వెడవిడి పోవ
మడతలుపడియున్న మాసినచీర
మ్లానహస్తమ్ముం మరలించుకొనుచు
పాయని ప్రేమ లోపల వెల్లివిరియ
బంధురహృదయానఁ బయనమై పోయె

లేవు కామ్యార్ద్రవల్లీసువాసనలు
లే వైహికపు భాగ్యలేశము లెవియు
లేని మోహనపుత్రు లేమియె తక్క
లే వా పడంతి హృల్లీలలయందు

నది గొనిపోయెడు నగ్నమార్గమున
నవనవలాడు నానందమ్ము గనుచు
వ్రాలుచు లేచుచు పైఁబయి నేఁగె
వారివీచికల సావాసమ్ము నమ్మి

వెనుక విడిచిన పురవీథుల మఱచి
శ్వేతభవిష్యన్నివేశము మఱచి
నిజమనోనిద్రావినీతినిఁ జంపి
నిశితజాగ్రదృద్రనీతిని లేపి
ఏకాకియై మన సెదురుగ నిల్పి
హీనకంఠస్వర మ్మిటునటుఁ దిరుగ
మనసానియంత్రిపై మరలించె దృష్టి
మాట లక్షులఁ గనుమాలమ్ముగాఁగ

"అవిధేయమానవప్రాణముల్ కంఠ
హారాల పోల్కి విప్పారిన దేవి!
సర్పభయోద్రేకసవనస్థలముల
స్వాహాస్వనముల నాశాభిత్తు లదర
చండకోపజ్వాల చల్లారిపోక
జ్వలియించు కనులఁ బ్రశాంతిఁ గుదిర్చి
విను మనసాదేవి! వేహుళ యేడ్పు
వేఁడిపల్కులు పల్కి వేధించు రాణి!

శ్రావణయామినీరాజితమూర్తి!
జ్వాలాభయంకరచంచలనయన!

తావకీనక్రోధదగ్ధదేహముల
　　　　తగిలి దొర్లించు రక్తప్రవాహముల
పరికింపమాని నాపైఁ గొంత సేపు
　　　　పఱపుము నీ కృపాబాంధవ దృష్టి
నీ కంటినిప్పుల నిరసింపఁ బోని
　　　　స్నేహార్ద్ర మొఱ జననీ ! గ్రహియింపు !

పూజాస్థలమ్ముల పూవులతోడ
　　　　పోఁద్రోసినారు నీ పుణ్యవిగ్రహము
వదలుచున్నా రుష్ణబాష్పముల్ నేఁడు
　　　　పరిపరివిధుల నీపాలిటి కొదిగి,
భవదీయశిఖనుండి పారిజాతముల
　　　　పడఁ ద్రోసినట్టి యా పాపపుఁ జేయి
నిర్జీవ మయ్యె నీ నిష్ఠురబాణ
　　　　నిహతిచే; నీ దయానీహార మిమ్ము

నీ పదపద్మాల నిలిపిన లాక్ష
　　　　నీ త్రొక్కుమార్గంపు నెత్తురు సుమ్మ
తరగని నీనోటి తాంబూలరక్తి
　　　　త్రావిన మలినగాత్రమ్ములు సుమ్మ
ఎఱ్ఱని చివురుల నెదిరించు వ్రేళ్ళ
　　　　హృదయాలఁ బెకలించు నెఱ్ఱని శిఖలు
రక్తపుత్రీ ! రక్తరంజితబుద్ధి !
　　　　రమ్మ చూపింపు నీ రక్తముఖమ్ము

# పు ష్య గా న ము

దక్షిణానిలమధుద్రవములు కడుపారఁ
గ్రోలి దిగ్వధువులు తేలియాడె
క్ష్మారమణీమణీశయ్యాంచలమ్ముల
నపరంజికిరణమ్ము లవతరించె
ధూళీపరాగావళీలాస్యకేళికి
నాకాశలక్ష్మి రసార్ద్రమయ్యె
పౌష్యలక్ష్మీప్రౌఢవదన లావణ్యమ్ము
లా ధాన్యరాసులం దడఁగి పోయె

రండు! గృహములలో నెవరుండఁ గలరు?
తలుపుగడె లూడఁదీసి యీవలకు రండు
పౌష్యలక్ష్మీసమాహ్వానభరితము లయి
భూనభోంతరాళమ్ములు పులకరించె

'ఎఱ్ఱగన్నేరు', శారద 1925

## పూ వు ల్ల పా ట

పాడవే! పాడవే! బంగారుతల్లి!
భూమిపై రాలేటి పూవుల్లపాట
రాలిపోయిన పూలు నేలపాలాయె
చిగురు పఙపుల మీద సొగసు లేదాయె
తీవతల్లీ నేడు పూవులూ లేవు
దిగులొందకోయమ్మ తీవెల్లతల్లి
పడకింటి శయ్యలో పవళించు పూలు
గౌరిపూజలలోన కరగేటి పూలు
భూమిపై రాలేటి పూవుల్లపాట

పాడవే పాడవే పూవుల్లపాట
పందిళ్ళ పూసినా పారిజాతాలు
రాసులై మళ్ళలో రాలేటిచోట
కావెళ్ళ తెచ్చేటి కనకరత్నాలు
గాలిలో దండలై తేలేటిచోట
అచ్చచామంతులూ విచ్చేటి వేళా
వసివాడి నేలపై పవళించుచోట
నీలాల ప్రోవులై నిలాంబరాలు
పచ్చిక బీళ్ళపై వాలేటిచోట
పాడవే పాడవే బంగారుతల్లి
భూమిపై రాలేటి పూవుల్లపాట

సంక్రాంతి, కృష్ణాపత్రిక 1926

## ఎన్ని నాళ్ళాయె

ఎన్నినాళ్ళాయె కోమలీ! యీ వనాంత
వీథికలయందు వలపులు విరియువేళ
నీవు పెంచి నీరార్చిన తీవపొదల
నాలపించిన నీ రాగ మాలకించి

సఖియ! యే జననాంతరసౌహృదములో
దాఁచియుంచిన నీ సన్నిధానమునకు
కాలి యడుగుల జాడలు కేళిసేయ
మరల వచ్చితి నీ లతాతరుల నరసి

1925

## గీ తి క

ఈ యుద్యానము లీ సరోవరము లీ
యింపైన నెత్తమ్ము లీ
సాయంవేళలు సైకతస్థలులు జ్యో
త్స్నారాత్రు లీ లౌకిక
శ్రీయెల్లన్ విడనాడి వేదికపయిన్
శిల్పాకృతిన్ నిల్వఁగా
నాయుల్లం బదియేమొ తల్లడిలి చిం
తామగ్న మయ్యెం జెలీ!

1942

## ర స పి పా సి

రసపిపాసిని నేను పారమ్మ్రులేని
గగనవీథీవిశాలరంగములయందు
అందగారాని తలఁపుల కందమైన
రూపములు దిద్ది క్రీడింతు రూపసరసి

తెనుగు సీమలలో నాల్గుకొనలయందు
పూజకై పుట్టి వర్ధిల్లు పూలతోడ
ప్రియతమములైన వలపుకోరికలతోడ
గంధిలం బయ్యె శ్యామలగగనవీథి

ఎన్నడో పూలుపూచె నా హృదయసీమ
కెంపుచివురుల కావేరి కీర్తిలతిక,
ఎన్నడో జీవనోద్యాన హృద్యవాటి
కెరలి పాడెను కావేరి కీర్తిపికము

బంధురము లైన యానాటి పరిమళములు
పాటలును, రూపములు దాల్చి పల్లవించి
యుగయుగాంతరవ్యాప్తవియోగభరము
మోయు, కావేరి సంపూర్ణమూర్తి దాల్చె

భావవిదులగు రసరాజ్యపాలకులకు
తొలుదొలుత భక్తితోడ చేదోయి మోడ్చి
అభినవమ్మగు రూపక మంధ్రభావ
నర్పణము సేయుచున్నాడ నందికొనుడు

## సంధ్యాకామినీ:

పూవుపొడితో పసుపు బూసుక
కావియిగురుల కాంతు లద్దుక
త్రోవ లెఱిగిన చరణములతో
రావె! సంధ్యాకామినీ!

ఉదయకన్యలు కలశములతో
పిదికిపంపిన యాలమందల
పొదుగులను క్షీరముల నింపితి
గదవె! సంధ్యాకామినీ!

పచ్చిమాలతి యాకు మడుపులు
గ్రుచ్చివేసిన పూలదండలు
తెచ్చియుంచితి మొక్కమా రిటు
వచ్చిపో! సంధ్యాంగనా!

నల్లనల్లని కలువదండల
నెల్లదిశలను నిదురనెలతలు
అల్లిపోవకమునుపె యమృతము
చల్లిపో! సంధ్యాంగనా!

అబ్బూరి రామకృష్ణరావు

ఎవరిపై నీ వలపు నిలిపితి ?
వెవరికై యీ పారవశ్యము ?
భువనభువనము లెల్ల తిరిగెద
వవుర ! సంధ్యాకామినీ !

ఉదయమున వెలిచీర చాటున
కొదమసంజల కావిముసుగున
పొదలునది నీవొకతెవేనా !
ఉదయసంధ్యాకామినీ !

# కా వే రి దే వే రి

కావేరి దేవేరియై వచ్చె నేడు
తరులతలార, పోదాము రారమ్మ !
పూవులు పూయరే పూదీవెలార !
ఫలము లందీయరే ఫలతరులార !

ఆరతు లెత్త వే ఆరామదేవి !
పద్యాలు పాడవే ఉద్యానలక్ష్మి !
మొగలిపూపొడితోడ ముగ్గులు పెట్టి
జాజిమొగ్గలతోడ పూజలు వ్రాసి
గోరింట గుత్తులు తోరణాల్ కట్టి
పొరుగువారలతోడ ప్రొద్దుపుచ్చేము
తరులతలార ! పోదాము రారమ్మ

పొలిమేరపొలములు పులకరింపంగ
దిక్కు లన్నిటిలోనఁ దివుట తీరంగ
దేవతలందరు తేరి చూడంగ
కావేరి కరుణించి కదలివచ్చేను
తరులతలార, పోదాము రారమ్మ !

వచ్చేటి దారిలో వరుసగా నిల్చి
పాలవెల్లులు గట్టి పందిళ్ళు దీర్చి
పిలిచి కావేరిని పలుకరించేము
పాపకర్మములెల్ల పారద్రోలేము
కావేరి దేవేరియై వచ్చె నేడు
తరులతలార, పోదాము రారమ్మ !

# ప్ర యా ణ వా ర్త

## 1

ఋతువు ఋతువున మోహము తేకులెత్త
సకియ ! నీవును నేనును సాంధ్యరాగ
రేణువుల ప్రోవులందు నర్తించినాము
చాలుజాలు ! జీవన మొక సంధ్యయయ్యె

మోహమున కలతనిద్దురబోవు మనము
తరలిపోయిన నవనవోదయములందు
చెల్లరే యెన్నిసార్లు మూర్ఛిల్లినామొ !
మోహనమ్మగు లోకాన ముసుగు వైచి

ఏమి పుణ్యము పండెనో యింతప్రొద్దు
రమణి ! ఆ యనంతప్రభాతములనుండి
కలసివచ్చిన మంగళకలరవమ్ము
వేయి వీణలవలె విననాయె నదిగొ !

సాగరమువలె తనువెల్ల సంచలించె
ఆత్మలో ప్రజ్వరిల్లె మహాగ్ని యొకటి
అబల ! ఏనాటిదో యీ ప్రయాణవార్త
ఏ సుదూరతీరమ్మున నెవరి పిలుపొ !

రసవివశమైన మదికి విశ్రామభూమి
యైన జగదీశ్వరీసన్నిధానమునకు
తీసికొనిపోవునేమొ, యిందీవరాక్షి !
పద, వెడలిపోద మా పుణ్యపదము చేర

## 2

వలపునిండార విరిసిన పారిజాత
కుసుమములు నేలరాలు వేకువలయందు
ప్రసవశయ్యాపథముల నీ పాదయుగళి
కదలెనొ, నాదు హృదయమే కలతవడెనొ ?

కాని పలుమారు నా కందరాని వస్తు
వేదియో దూరముననుండి యెలుగులెత్తు
పరిమళపరీతమైన నీ ప్రణయవార్త
భూనభోంతరాళమ్ములు పులకరింప

బహుళమందారగంధలోభమున తిరుగు
మధుకరము వోలె హృదయ మున్మత్త మయ్యె
పరవశమ్మైన భావప్రపంచమందు
బందినై యెన్నినా ళ్ళుండవలెనొ యేమొ

దీపికలు లేని వాకిళ్ళు తెరచి నాదు
తలపు లొక్కొక్కటే నిన్ను తెలియబోయి
తిరిగి వచ్చుచునుండు పందిళ్ళక్రింద
కేళి దిరుగాడు పెండ్లిచుట్టాల రీతి

3

కాంచెదనొ లేదొ కనకచేలాంచలములు
తోడ దిక్కులు వెలిగించి త్రోవ చూపు
భువనభువనైకమోహనమూర్తి నింక
సంశయము దీర్ప నెవ్వ రీ జాడ లేరు

ఈ కనులు నోచెనేమొ దేవీకటాక్ష
వీక్షణాంతములందు స్రవించు నమృత
మాని ఈ తీవ్రదాహమ్ము నాపుకొనగ
ఎవరు నా యీ ప్రయాసమ్ము నెఱుగువారు

వైశాఖి 1932

## త్రిశంకువు

అని యత డాలపింపగ శి
వాలయ సానుతటమ్ము లంచిత
స్వనములతో ప్రతిధ్వనులు
సల్పె మహామతియైన గాధిసూ
నున కెదురాడగా వెఱచె
నో యన నంతట నిస్తరంగమౌ
వననిధివోలె శాంతిలె ను
పాంతచరాచరజాల మంతయున్

1910

# వృత్తాలు

నే నొకవ్యర్థజీవిని పు
నీతములైనవి నా నమస్క్రియా
ధీనములై పయోనిధులు
దివ్యసరోరుహ మేల వచ్చెనో
ఈ నవమేదినీనిలయ
హేమవనమ్మున నగ్నిగోళమై
శ్రీనిలయమ్ములందు నివ
సించు మనోహరమందిరాభ్రమై

ఏ యవరోధ మేనెఱుగ
నీ యవనీస్తవనీయగోస్తనీ
చ్ఛాయల చాయలందు వికచ
చక్రకచంబులు కేళిసేయగా
పాయలు పాయలై విధుర
భావము లావములై మహోమహా
గేయములై మహారథుల
గేహములై తనరారె నీయెడన్

## అబ్బూరి రామకృష్ణరావు

ఉదయసుధానిధీ! భవప
యోధుల దాటగ తేపలైన నీ
సదమలపాదపంకజర
జస్సుల నా తలపైన నిల్పి నా
యెద కదలించు వేదనల
హేమమృదంగతరంగమంగళా
భ్యుదయము దిగ్దిగంతరమ
హోదయమై విలసిల్లు గావుతన్

1950

# వర్షాగమము

రసికహృదయము లోలలాడే
మసుపు దినములు మరలి వచ్చెను,
మిసిమి మబ్బులు వ్రేలు మేలిమి
ముసుగుతో నాకసము విచ్చెను!

తరలి రా, ఆపాఢలక్ష్మి
మెరపుతీవలు తొలకు రథమున,
మురిపెమున దిక్కాంత లలరగ
తరలిరా! మేఘముల పథమున!

పది కెలంకుల నూడ్చి వల్లీ
మదవతులు కానుకల నుంచిరి,
మొదటి చినుకులతోడ మెఱసే
పొదుపుతో మోములను వంచిరి!

వేకువలలో శంఖ మొత్తుచు
లోకముల నిక మేలుకొల్పుము,
శ్రీకరములగు తటిపివానల
శీకరము వాకిళ్ళ నిల్పుము!

మంగళస్నానమ్ము లారిచి
 చెంగలించెడు నీటికాలువ
పొంగిపోయె; నొసంగు పృథివీ
 ప్రాంగణములకు పచ్చశాలువ!

అడవికోనలలోన నీకై
 యెదరు వేచిన నెమిలికన్నెల
కడుపుకోతల నిల్పి, దాహము
 లుడిపి పఱపుము చల్లవెన్నెల!

ఉరుము లురిమెడు గర్జనమ్ముల
 మెరుపుతీవల మేలవింపుము,
మురిసియాడెడు వానచినుకుల
 సరసగానము లాలకింపుము!

1935

## ద్రాక్షాపేక్ష

నేడు నా ద్రాక్షపందిలి నీడలందు
స్వాదురసభారవశమున వ్రాలిపోయె
గెలలుగెలలుగ జారిన ఫలచయమ్ము
రాజరాజేశ్వరీ, వేగిరముగ రమ్ము!

చిరదినమ్ములనుండి పెంచిన మదీయ
ద్రాక్షవీధీనికుంజమధ్యమున నిల్చి
జన్మజన్మాంతరము పరిశ్రమము నెల్ల
సఫల మొనరించి పోదువు, సాగి రమ్ము!

చల్లని సమీరములకు కంపిల్లుచున్న
మధురఫలగుచ్ఛములలోని మదిర నోడ్చి
భావ ముప్పొంగ మణిమయస్వర్ణపాత్ర
లందు నిండార నింపెద, నందికొనుము!

మొక్క నాటిన సుదినము మొదలు నేటి
వరకు నీ వెన్న డుజ్జ్వలవాహనమ్ము
నందు నాసీనవై వత్తువా యటంచు
వేచికొనియుంటి, నింక నావేళ వచ్చె

ఫలగుళుచ్ఛము లన్నిటి బాసి, రిత్త
వోయినను పోవనిమ్ము, నా పూర్వవాటి
ప్రథితధనధాన్యబహుళభారమ్ము కన్న
నీవలన కల్గు లేమి శోభావహమ్ము !

తెచ్చుకొన్నదికా దీ యతీవకరిన
వాంఛ, జంగమస్థావరవర్గమెల్ల
కోరుకొనుచుండె నిదె గుసగుసలతోడ !

ఆ మహాశక్తికై వినయాంజలులను
భూతసామ్రాజ్య మెల్ల కేల్మోడ్చి యొసగు,
ఎంత గుహ్యమొ కద యీ యనంతపథము,
ఎంత యజ్ఞేయమో యెట్లు తెలుగవచ్చు !

## మందార శిశువు

ఏమొ యేనాటి సంబంధమో మదీయ
గేహవాటిని పూవుఁదీఁగెలకు నడుమ
సూర్యకాంతముల్ కనులారఁ జూచుచుండ
మొలిచె నొక మొక్క త్రిజగతీమోహనముగ

ప్రథమదశములు క్రమముగాఁ బాసిపోవ
దీపశిఖవోలె మెఱసె నతీవకాంతి
మంతమై తన సుకుమారమధురజన్మ
మునకు నంతర్దశమ్ములు ముసుఁగులెత్త

అంతకొన్నాళ్ళ కా చిట్టివింతఁ జూడ
నిరుగుపొరుగు వధూజన మరుగుదెంచి
కనుబొమలు వంచి కంకణరణితపాణి
తలములం దేర్చి చూచి 'మందార' మనిరి

ముంగురులువోలె మౌళిపై పూపచివురు
లల్లనల్లన నసియాడ పల్లవాంగు
శులు కదల్చుచు పరిమళమిళితపవన
డోలికలలోన శైశవలీలఁ గడపె

బాలికలు బాలకులు నాలవాలమందు
కలశములతోడఁ బోయు నిర్మలజలంబు
తనివి వోవఁగఁ గ్రావి మందారశిశువు
శైశవమువోవ సలిపె నాకాశయాత్ర

ఆవలీవలనున్న పుణ్యాత్ము లందు
'కుశలమౌనె మందారము ? కోరినన్ని
పూలు పూయునే ? మా దేవపూజ కిన్ని
పంపవలె' నని యడుగనివారు లేరు

ఆప్తులగువారి ప్రేమభాగ్యమ్ము వడసి
అనుదినమ్మును పెరిగె నా యనుఁగుమొక్క;
ఆ చిఱుతయంకుర మ్మెట్లు నోఁచికొనెను
మానవకుటుంబమందు ప్రేమానుభూతి ?

కడచనియెఁ గొన్ని దినములు, పడుచుఁదనపు
వాలకముఁ దాల్చినది, దాని పజ్జ నిలిచి
యెంతపొడవైనదని మదినెంచ, నాదు
చిబుకమును దాఁకెఁ దచ్ఛిఖాశేఖరములు

అప్పటికి వేఁగుజామయ్యె; నభ్రవీథి
వెల్లఁబోయెఁ దారకలు; వీవెనలు వీచె
గళితసుమగంధవహమైన గంధవహము
పలుకరించె మందార మీభంగి నన్ను

'ఓయి నరసఖా ! వెచ్చనిచేయి తగిలి
తేజరిల్లె నా సుస్థిరదేహయష్టి,
పావనమ్మగు నీ కరస్పర్శ కొఱకు
లెక్కలేని జన్మాలు తాల్చితిని నేను

'నీవలన నాదు స్థావరజీవనమున
భద్రమయ్యెను మానుషపరిచయంబు;
అస్మదనుభవసంతానమందు వెదుక
నిట్టి యానందహిందోళ మెందు కలదు ?

'నీవు నీవారు చల్లనినీడఁ గోరి
చేరవచ్చిన, దిక్కుల బారవెట్టు
నాదు శాఖలతోడ నాచ్ఛాదనమ్ము
కల్పనముసేసి కూర్తు ననల్పసుఖము

'నీ ప్రియాంగన పెరటిలో నిద్రవోవ
శాఖ లల్లార్చి పవనసంచాలనముల
పవనములు రేపి యామె ప్రవాళమృదుల
శయ్యపై వీతు శుష్కమై శాఖనిశల

'ఆపె చక్కని చెవికొన లందగింప
మధురసార్ద్రిము లైన సంపన్నకుసుమ
మంజరులు పూతు, పన్నగీమానవతుల
జిహ్వికలవోలె కేసరశ్రేణి వ్రేల



9

'కమియవిచ్చిన నా కుసుమములలోని
మధువు లానువేళల నీ యమాయకంపు
తరువు తన జీవనమ్మెల్ల ధారవోసి
యొసఁగె నర్ఘ్యం బని తలంపుమోయి సఖుఁడ!

'వినుము! గాఢతమోలతావేల్లితమ్ము
లౌ నమారాత్రులందు నా యంతికమ్ముఁ
జేరి, చెవులొగ్గి యేతన్నిశీథపవన
చాలనమృదుస్వనమ్ముల నాలకింపు

'బంధురమదీయపల్లవపత్రరాశి
విబుధగణమర్మరాలాపనిబిడమై మ
నోహరమ్మయి, త్రిభువనమోహన మయి
జగదధీశ్వరి కాస్థానసదన మగును

'అపుడు నిండార విరిసిన యస్మదీయ
మూర్తి నెమిలిపింఛమువోలె ముద్దులొలుకు
నా హృదయమంత నర్తించు, నవపయోద
రమ్యదర్శనమున మయూరమ్ము వోలె

'స్థావరము జంగమమ్మును తారతమ్య
మా మహానందసాగరాభ్యంతరమున
మాయమగును; మందారమో మానవుండొ
అందఱును తోడఁబుట్టువు లా జగాన

'ఏది యొకసారి నీ యతిమృదులబాహు
శాఖ నా శాఖపై కొంత చాచికొనుము
దీనికొఱకు కాంతారనదీతటీని
వాస మొల్లక నినుఁగోరి వచ్చినాను

'నాప్పిపుట్టఁగ సొనల బిందువులు రాల
కొమ్మకొనల పల్లవమొండు కోసికొనుము
ఆ మధురవేదనాభర మనుభవింతు
పావనమ్మగు మానవప్రణయ మెంచి'

ఈ యనంతలతాతరుచ్ఛాయలందు
నీరసమ్ముగ నిభృతమ్ముగ నిలిచియున్న
స్వాదుసందేశ మీ నవోషస్సు వేళ
నాకు వినిపించె నెంత పుణ్యంబొ! తలఁప

తగిన సావాసములు లేక మిగుల డస్సి
యున్న నా కోరికల కయ్యె నుత్సవమ్ము
అమృతభాండంబు నా హృదయాంగణమున
నొలికినట్లయ్యె, జగతితో చెలిమియయ్యె

వెన్నెల కుప్పలు 1931

## ముఖమందిరము

మొలకలెత్తవు కొన్ని మోహనస్మేరాంకు
రమ్ము లానందతీరముల గాని
క్రీడ సేయవు కొన్ని క్రీగంటి చూపులు
రమణీయసన్నిధానమున గాని
విరియబారవు కొన్ని వేడి కన్నీటి బిం
దువులు కారుణ్యసింధువుల గాని
పెదవిదాటవు కొన్ని మృదుపదబంధముల్
రసవదాలాపవర్ణముల గాని

సొంపు నింప నంగీకారసూచకముగ
భువనకల్యాణమూర్తుల మ్రోలగాని
బొదలం గొన్ని చెల్లింప వహహ యెంత
సుందరములు మానవముఖమందిరములు

1928

# భ గ్న మా లి క

పూవులు పూయరాక తమ
పొత్తులలోనె కృశించి కమ్మనౌ
తావులు వీడి రాలిపడె
తామరతంపర యయ్యొ దుఃఖ మీ
జీవనసాగరంబు దరి
జేర్పగ జాలెడు పుణ్యశీలి యౌ
నావికు డెవ్వడో యెఱుగు
నా యత డీ హతభాగి వేదనన్

ఈ యతిలోక మోహన మ
హీతలమందున తోడులేక పా
ధేయము లేక సిగ్గిలి మ
దీయమనోహరభావపల్లవ
చ్ఛాయలలోన వ్యర్థపు వి
చారముతో ననవాప్తకామ్యముల్
రోయుచు భగ్నమాలికలు
ప్రోవులు సేయుచు సంచరించితిన్

నేనే కాదు సమస్తభూతతతియున్
నిర్వేదభారమ్ముచే
నానాభంగుల లాలనీయగతులన్
నా గీతమే పాడు లో
కానీకమ్ములలోన లోన నొక హా
హాకార ముద్భూతమై
శ్రీనారాయణపాదనీరజరజా
శ్లేషమ్ము కాంక్షించెడిన్

1933

## నీ మహిమార్ణవంబున

నీ మహిమార్ణవంబున మునింగి యనర్ఘ రుచిప్రవాళము
క్తామణిరత్నఖండములు దండలుగా సవరించి తెచ్చి పృ
ద్వీమహితమ్ములౌ విపణివీధులలోన నలంకరింతు నీ
ప్రేమ నెఱుంగలేని మణివేత్తలు మోహితులై తపింపగన్

నీ కడకంటి చూపు లవనీస్థలిపై రచియించు కల్వపూ
రేకులు సేకరించి యిరుక్రేవల యుద్ధ మొనర్చు సైనికా
నీకము మీద రాల్తు, నది నీ నయనామృతమం చెఱుంగగా
లేక రణావనిన్ ప్రణయలీలలు మాని సుఖింతు రెల్లరున్

నీ యమృతప్రవాహముల నింపిన తీయదనమ్ముతోడ నే
మో యొక రెండు ప్రౌఢపదముల్ పలికింపుము నాదునోట కొం
పోయి భవాంబుధిన్ మునిగి పొక్కెడివారికి నీ విశాలశో
భాయతనమ్ము జేరగ నుపాయము సెప్పెద నెల్లవేళలన్

## అ తి థి

ఏ శరద్వేళ పులకితాకాశవీధి
నెవరి దీవించునో జనయిత్రి నేడు !
ముని మనస్సుల నర్తించు పుణ్యశీల
యే విపినవాటికల నుదయించు నేడు !

ఆమె చేలాంచలముల పరీమళమున
భువనములు పదునాల్గును పులకరించె
సప్తపర్ణసుమావళీసాంద్రగంధ
బాంధవమ్మున నిఖిలదిగ్వధువు లట్లు

ఈ యనంతభూములయందు నెవరి నడిగి
తెలిసికొందును నా స్వప్నదేశమునకు
వెలుగునీడలు దిశలెల్ల వెల్లివిరియ
నతిథిగా వచ్చినట్టి వృత్తాంత మంత ?

# సా యం త న ము

రాగవతి యైన సంధ్యాపురంధ్రి యాన
దానసమ్ముల చీరెలు దాల్చి వేగ
పడమటి సముద్రతీరాల పడుచు చెలులు
చల్లుచున్నారు కుంకుమాక్షతలు నేడు

కావిరంగులు వర్ధిల్లి తీవె సాగి
యఖిలదిక్కూలములను నిండార విరిసె,
విశ్వరూపసందర్శనవిధము దోప
సంభ్రమించితి నిటు చిత్రసంధ్య గాంచి!

'ఆహహా! యే రాణికై యీ యజాండమెల్ల
పారబూసిన దిన్ని జపాసుమములు!
ఏ నిఖిలరసమూర్తి యాహ్వానవార్త
విని, సముద్రుడు మ్రోయించు విజయభేరి?

అఖిలదిక్ఛిఖరమ్ము లయందునుండి
చారుతర మయ్యె మందారతోరణమ్ము
విశ్వసంచారశీలము విడిచి నాడు
చిత్తము ప్రశాంతి జెంది స్వాయత్త మయ్యె

ఏ నిభృతనికుంజమ్ములలోన మ్రోగు
దివ్యమంజీరరవమొ ప్రతిధ్వనించె
నా హృదయకుంజవీథి, ప్రాణపదమందు
మొలిచె నుత్కంఠ యొకటి, యే పుణ్యఫలమొ!

మధురమైన సంధ్యారాగమదిర ద్రావి
సగము ముకుళించె గన్ను; లస్తమయవేళ
చల్లగా సాగిపోయె; సంఫుల్లనీల
కాంతులం దోగి శర్వరీకాంత వచ్చె

# చారుకుసుమాళి

చారుకుసుమాళి చెంత నోషధుల చెంత
కళవళించు నానాపరీమళములందు
నిన్ను స్మరియింపగా జేయనేర్చు మధుర
గంధ మేజాడ నున్నదో కానరాదు

మంజులాలాపనిబిడనికుంజసీమ
రవళి సేయు నానాస్వరగ్రామమందు
నీ హిరణ్మయమందిరాంతికము జేరు
మార్గ మెఱిగించు సుస్వరవర్గ మేదొ ?

నవనవోన్మేషమైన నానాత్వమందు
తవిలి నా హృదయంబు స్వాస్థ్యంబు గనదు,
రాగవశత సంధ్యాపంజరమున జిక్కి
మినుకుమినుకను నక్షత్రమణి విధాన

నిఖిలలోకేశ్వరస్వామినీ ! మదీయ
పూర్వపుణ్యాలతాంతమై పూయనిమ్ము
నీ యఖండతేజోమహనీయమూర్తి
శ్యామలములగు నాదు చేలాంచలముల

## క వి త

### 1

ఏనాడో ఒక్కనాడు
నేనూ నా చిన్ననాట
నవనవయౌవనవేళా
నందనసౌందర్యంలో

కావేరీనదీతీర
కల్యాణధరిత్రిమీద
పచ్చని పచ్చికపరుపుల
పవళించిననాటి మాట

మసక మసక వెన్నెలతో
మత్తిల్లిన పూగమ్ములు
పూగమ్ముల పెనగొను తాం
బూలలతాపల్లవములు

తమాలతరుచ్ఛాయలలో
తలిరుటాకు గుసగుసలు
నానాసుమపరిమళములు
వీణానిక్వణనమ్ములు

అబ్బూరి రామకృష్ణరావు

నా జీవనగగనసీమ
నాలుగుదెసలందు నిండి
నా మానుషదేహంలో
నాకలోకసౌభాగ్యం
కదలినట్లు మెదలినట్లు
కడలివోలె మ్రోగినట్లు
కలలుగాంచి కళవళించి
కలలో నే కమనీయత
గాంచి తనువు పులకరించి
నీ భక్తుల కనువైనది
నిండువేష మొకటి దాల్చి

తెలుగుదారి వెలిగించే
వెలుగుదారి తెలిగించే
క్రొత్త ప్రాత మాటలతో
మెత్తని పదముల బాడుచు
ఆంధ్రమహామహీజనని
యశోగీత మాలపించి
స్పందించిన హృదయమ్ముల
కొందర మానందించాం

ముడుతలుపడి చినిగిపోయి
చెడిపోయిన కడివోయిన

వెనుకటి ఆ వేషాన్నే
వేవిధాల విరుపులతో
మళ్ళీమళ్ళీ తాలిచి
పెళ్ళికొడుకులకు మల్లే
వీథివీధి విహరింతురు
ఆధునికులలో కొందరు

ఈ వేషం వెనుకటిదే
ఏమీలే దావేశం
ప్రయోగాలు లేని నుడులు
అయోమయపు పలుకుబడులు
శాఖలపై శాఖలుగా
సాగు తెలుగు సంసారం
ప్రతిఫలించ దీ నదిలో
పరిమళించ దీ వనిలో

ఎత్తండోయ్ రక్తకేతు
వొత్తండోయ్ జయశంఖం
రక్తారుణరణపతాక
ధిక్కారమహాశంఖం !

రష్యాగురుధూపంతో
రమణీయపు శివమెత్తిన
రణాచారి గణాచారి



10

రణగుణాల ధ్వనులు రేగ
రష్యా ఋష్యాశ్రమమున
రాగిల్లిన కావ్యధార
తెలుగుసీమ పొలిమేరల
సెలయేళ్ళయి నాళికలయి
చిరకాలం ప్రవహించే
జీవనదీమహిమ లేక
అంతో యింతో శైత్యం
అంతకు మించిన పైత్యం
అందించిన మాట నిజం
ఔను నిజం! ఔను నిజం

కీళ్ళు పట్టి కళ్ళు కప్పి
కళ్ళెముతో బిగియించిన
గుర్రముపై స్వారిచేయు
కోవిదకవు లౌకవంకా

లోలాక్షులు సహచరులై
కేళాకూళుల తిరుగుచు
లోకపు బాటల కవ్వల
చీకటులూ, వెలుతురులూ
సగం సగం కలసి మలిసి
సంధ్యారాగాలు రాలు
కుహనాలోకం లోపలి

గుహాలలోన కూజించే
కోమలకపోతవంకా

కొలిచిన కవితాపురంధ్రి
మరపుతెరల మాటుమణగి
మాయమైనదా లేదా ?

వలదని యౌదల దన్నిన
వెలితి మాట లెల్ల నేటి
వేదాంతము కాలేదా
ఖేదము తొలగింపలేద ?

మూటగట్టి ముల్లెచుట్టి
మూలమూలలందు చాటి
బాకాలూది కేకలేసి
లోకానికి సైగ చేసి
శతసహస్రయోజనసం
చారకుతూహలచంచల
భావనాకురంగ మెక్కి—
ప్రస్థానం ప్రస్థానం
జయదమహాప్రస్థానం !

పయనమైన పదినాళ్లకె
పదినాళ్లకె దారితప్పి

పోయావా నా నేస్తం
ఆఁ! దేవీ నీ హస్తం

పొరపాటీ తిరుగుబాటు
తిరుగుబాట తిరిగి చాటు!

**2**

మనసులోని యాలాపము
మాటలలో మారిపోవు
ఎత్తిన కవితాదీపము
వత్తి కుమిలి యారిపోవు

ఎలుగులేని వెలుగులేని
హేమంతమ్మొకయి పుత్ర
ఈ చీకటి రాజధాని
కేలా యీ దండయాత్ర.

వరదవారు కావేరీ
సరిత్తీరవృక్షరాజ
శేఖరముల నీడలలో
మంజులమంజీరమ్ముకయి
మధురరుతము సేయుచుండి
కనిపించిన మధుమూర్తి
కవితా కల్పనా లతా!

మరలనేడు నా హృదిలో
మరులుకొల్ప దలిచావా ?

నీకూ నాకూ మధ్యను
శోకార్ణవ మొకటి పొంగి
లోకాలోకమ్ములలో
లోపలి మందిర మందలి
ఒక గవాక్ష మొక కవాట
మోహా ! అవిష్కృతమై
వెనుకటి యాలాపమ్ములు
తునుకలు తునుకలుగా తెగి
ఒక్కచోట చిక్కువడ్డ
చక్కని నా జీవనౌక
అనంతాబ్ధిసాంగత్యా
మ్మభిలషించి పయనమయ్యె

జీవనబాధకు వెలిగా
నీవూ నేనూ నీవూ
స్మృతికందని మృతినొందని
అతిలోకవిహారమ్ముల
బ్రతికే రోజులు కావివి.

మనిషిమాట మరచిపోయి
మనుగడలకు దూరముగా
మట్టినేలపైని మమత,
మానవులన, వైముఖ్యం

జననీ జన్మభూమి శ్చ
స్వర్గా దపి గరీయసీ
జన్మభూమి జనని కాదు
సామాన్యసుమా ఆయమ
వసుమతియగు నామెకొరకు
వల్లభు లెందరు పెనగిరి ?

మొగలాయీలూ, గ్రీకులు,
బుడతకీచు, లాంగ్లేయులు,
పెర్షియనులు, అఫ్ఘనులూ
ఫ్రెంచివారు, మంగోలులు
ఎందరెంద రీ నేలను
ఇలాపతులు భూపతులై
ఏలలేదు సాటిలేని
ఏకచ్ఛత్రమ్ము క్రింద
నా దేశం నా రాష్ట్రం
నా పట్నం నా జిల్లా
మట్టిగడ్డ కాదుకాదు
మానవజాతిపురోగతి

మానవలోకం చుట్టూ
మసలుతున్న మహిమార్ణవ
మథనానికి దారితీసి

మండుతున్న అరణ్యాన
పండువెన్నె లలమ చేసి
మెండుగ కేదారమ్ములు
పండించీ ఆకలిపులి
ఖండించీ నడచిపోవు
మానవుడా ! నీకు జయం
మాకిటుపై లేదు భయం

మనిషిమాట మరచిపోయి
మరచిపోయి మనిషిమాట
కార్మికులూ కర్షకులూ
ధార్మికులూ, ధనపతులూ
విడివిడిగా యెడపెడగా
తడబడగా ముడిపడగా
ఆవరించి తీవరించి
అవరోధం కల్పించే
ఈ చింతాదారిద్ర్యం
ఎన్నడు మము వీడిపోవు ?

## 3

రాలునేమొ రాలునేమొ
రాగరసము నేడేనని
పండునేమొ నా కోర్కులు
పరవశముగ పాడేనని

అబ్బూరి రామకృష్ణరావు

వేచివేచి వేసారిన
విఫలమనోరథుల కేక
వినిపించని వేళలేదు—
విధియు విరామమ్ము లేక

జగ మెరుగని సన్న్యాసులు
గగనకుసుమమధువు త్రావి
కలలలోన కథలలోన
కల్పించే యెండమావి
దప్పిగొన్న సంసారుల
తనువులు నిలబెట్టేనా ?
శోషిల్లిన శ్రమజీవుల
శోకము పోగొట్టేనా ?

నీడలేని వెలుగునకై
ఈడేరని కాంక్షలార
పరితపించి భ్రమియించే
భ్రాంతులార, బంధులార !
వినలేదా వినలేదా ?
విజ్ఞుల శంఖారావము.
'మాయలేని మహిమలేని
మానవుడే మనదైవము.'

వ్రాయలేక వ్రాయలేక
వ్రాయుటలో పరమార్థము
వర్ణింపగ నలవిగాక
వర్ణింపగ బలములేక
వందేమాతరమని యొక
మందారము నీ పూజా
మందిరమున నిలిపెద రొక
కొందరు మధురకవీంద్రులు

నరలోకపు చెరసాలకు
నలువైపుల కటకటాలు
అవనీతల మావరించి
అవరోధాలు విరోధాల్
అంతరాయపరంపరలు
సంతమసం సంఘర్షం
సంశయాల సందోహం
సంకీర్ణస్వాంతచింత

జననం మరణం మధ్యా
సాగే యీ ప్రస్థానం
దూరమెంత ? భారమెంత ?
ఊహాల కందని తారా
వ్యూహా లవలోకించీ
అణువణువున మణగియున్న

మణిరోచిర్నివహమ్ముల
విలయభయంకరనృత్యం
విలోకించి విలోకించి
వెలయించే ఆశ్చర్యం
విలువయెంత ? నిలువయెంత
తారకు తారకు దూరం
నిరాధారసంచారం

వలపులేని నవయువతీ
చలితాధరమునకూ నీ
నులివెచ్చని యూపిరికీ
గల దూర మనంతంబై
దుస్తరమై దుస్సహమై
తోచే వేళలలో నీ
దూరాలోచన లన్నీ
దూరీకృతములు కావా ?

**2**

సన్నాహముతో శ్రమతో
సంతోషముతో భ్రమతో
శ్రావ్యప్రస్థానభేరి
సందడింప బయలుదేరి
ఎన్నిదినా లెన్నియుగా

లెన్నివీధు లెన్నిత్రోవ
లిన్నాళ్లూ నడచితివో ?
ఎన్నినిన్న లెన్నిమొన్న
లిన్నాళ్లూ గడచితివో ?

అనాదిపురి అనంతగిరి
ఈ నగరాల్ రెంటిమధ్య
మేరలేని దూరంలో
మిధ్యాగమనం చేస్తూ
ఇటువైపూ అటువైపూ
తటముల కన్వేషిస్తూ
అందరాని అందాలకు
అందులేని చందాలకు
ఆందోళిస్తూ ఆలోచిస్తూ
ఆశిస్తూ ఆలిస్తూ
నిలిచీనిలువని క్షణముల
నిలుపలేక మలుపలేక
ఆలసింపగా నేలా
ఆయాసం పడనేలా ?

నీ వధిరోహించిన యీ అల
నిత్యం శాశ్వతము సుమా
నీ కల్పించిన యీ కల
నిజం నిజం వాస్తవికం.

అంతులేని యీ జీవన
కాంతారాంతరముల నీ
చింతాదీపం బెంతటి
చిన్నిచిన్ని వెలుగిడినా
అంతేచాలు నంతేచాలు
అంతకన్న లేదు మేలు
ఈ యనంతపరిష్వంగ
మెచ్చటి కచ్చటికే సరి
అజ్ఞాతాజ్ఞేయాలకు
అజ్ఞానంతో నేస్తం !

హే కవేరకుమారికా
శ్రీకరస్రోతఃశీకర
లాలితనిటలాలకే ! హే
లాస్యచరణసంచారిణి !
నందనవాసిని ! కవితా
సుందరీమణీ రమణీ !
అన్యాశ్రయములలో నీ
సన్యాసిని మరిచిపొమ్మ
నీ నికుంజసీమలలో
నిన్నారాధించే జనములు
భావుకులూ బంధువులూ
భావియనక భూతమనక

కలకాలం కలలవోలె
వెలిగింతురు నీదుతోట
అమరలోకసంవాసిని
అమృతహాసినీ వాణీ !

## శ్రుతి

బ్రతికియున్నవారికన్న
చచ్చినవారే యెక్కువ
కద ! ఈ యల్పసంఖ్యపై
ఏలా నీకి మక్కువ ?

అనలేదా కాళిదాసు
అజవిలాపగాథలోన
"మరణము ప్రాణులకు ప్రకృతి
జీవితమే వికృతి, కాన

క్షణమైనా ఊపిరితో
జీవించేయెడల ప్రాణి
మహాలాభ మనుకోవలె
ఇదే బుధోత్తముల వాణి''

పైరుపండి రాలినట్లు
ముసలియై లయించు జీవి
రాలి మరల వచ్చుననుట
రమ్యమైన యెండమావి.

వచ్చే దాక కొత్తపైరు
పండే దాక కొత్తపంట
దీనిపైని శ్రద్ధలేక
దానికేల కడుపుమంట?

ఏమన్నా నేటికన్న
రేపటివిలువే తక్కువ
అందువల్ల కానోపును
అల్పసంఖ్యపై మక్కువ!

# ఏ త్రోవల పయనించెదవు

ఏ త్రోవల పయనించెద వే నిశీథశయ్యలపై
శయనించెద ? వే యెలదోటలలో ని యావాసము ?
ఏ కరాళపన్నగీసమూహము నీ సావాసము ?
తరుశాఖాలంబితమై తూగు వెలుగుటుయ్యలపై
చంచలించు నీ రూపము, పరిమళములు కదంబించు
నీ విలోలమందహాససౌదామని యొక్కసారి
నా యంతస్సీమలందు వెల్లువయై వరదవారి
ఏ జన్మాంతరసౌహృదమో నాలో మేళవించు.
మఱి వేఱొకవేళ ముక్తకేశివై దిశావిశాల
వీథీవేదిక లదరగ విక్రమించి విలపింతువు
విషమవేషధారిణివై జ్వాలామాలికలు వ్రేల
ఘనభోంతరాళమ్ములు కొందలింప విహరింతువు
నా జీవనపాతాళము పెల్లు వెల్లివిరిసె నేమొ ?
నాకధునీజలదమాల జడివానలు కురిసె నేమొ ?

## ఈ శ్మశాన భూమి ఖండము

ఈ శ్మశానభూమిఖండ మీ కాలిన సెలినేల
కాలము కన్నీళ్ళు కార్చి క్షాళించిన బూదిప్రోవు
జీవనబాధావిధులు చేరిన విశ్రామశాల
నీరవనిబిడాంధకారనిర్వాణమ్మునకు తావు
ఈ వసంతవేళ నే డిదేమో చివురుల మంటలు
రేపిరేపి యెదయెదలో మేలుకొల్పి కలరవములు
వల్లకాట పండించిన దెన్నో పూవుల పంటలు,
చిందించిన దల్లవివో సురభిళమధురాసవములు
అవ్వలి పెంజీకటిలో నవరోదము లెల్ల చీల్చి
కటికనేలపై శ్యామలకోమలరాంకవము మడిచి
దగ్ధులైన ప్రాణులు తరులతావేషములను దాల్చి
తరలివచ్చి నిల్చిరేమొ! మృత్యురాజధాని విడచి
ఏ యశాంతినర్తకి యీ సింగారము లొలకించెనొ?
ఏ పురాణశోకరేఖ లీ యామని పులకించెనొ?

# బ్రహ్మచారి సమితి

## 1

ఏమని లోలో
తలపోసెదవో
యేనెరుగను మరి
విప్పిచెప్పవో లలనా !

కంటినీటితో
కళవళించు నీ
కన్నులలో నే
లాటి భావములు
తేలిపోవునో లలనా !

మన సిమ్మనునేమో యని
భయము భయముగా నుండును
చూపు లెచట చిక్కువడునో
యని కనులే యెత్తబోను

మరీయింత చేరువగా
నునికి నాకు వెరపుగొల్పు

కంటిచూపు నోటిమాట
కలియబడియెనేని యింక
నేమయినను గలదా మరి ?

2

మాటయైన చెప్పకయే
దాటిపోవునేమో యని
నిదురరాదు నా కనులకు
అతని చెంతనే యున్నను
ఆత్మవ్యథ తప్పదాయె

దారితప్పి యే పథికుడు
చేరె నాదు ప్రాణనదీ
తీరభూమి నతడు మరల
దారి తెలిసికొని యే రహ
దారులబడి పోవునో యని
నిదురరాదు నా కనులకు

ఆవరణము ఛేదించుక
అరుగుదెంచినా డాతడు
తెరచియున్న ద్వారమ్ము్మన
మరలి యతడు వెడలిపోవు
పిచ్చి కలల యలలు లేచి
హెచ్చెను హృదయోన్మత్తత

వేళకానివేళ యెంత
వేడుకొన్న నేమాయెను
విందురెవ్వ రీ వినతిని
నిదురరాదు నా కనులకు

3

పోనులే పోనులే పోను
వగ మాను మింక మదిలోను
రేయెల్ల గడచినా విడనాడిపోను
పోయినా ఒకవేళ నేను
పోయివత్తు నటంచు చెప్పిపోయేను
వెలుగునీడల దారు లొలసి తిరిగేను
ఎడబాట్లు కలయికలు ఈ రెంటిలోను
నా లలితహృదయ ముయ్యాల లూగేను
ఈవు చలియింపవని యెరుగుదును నేను
క్షణమాత్ర మీవు కన్మరగియుంటేను
నిను పొందలే ననుచు కనలిపోయేను

4

నీచెంత నింకెవరు నిలువగలరో చూడు !
ప్రాణేశ్వరివి నీవు నాకొక్కదానివే
పార్శ్వవర్తిగ నిల్చువాడ నేనొకడనే

5

నీ ప్రసన్నవీక్షణముల
రాజలాంఛనమ్ము గూర్చి
నన్ను మహాపురుషునిగా
చేయగలవు సుమా నీవు!

6

నీ కోమలహస్తమ్ముల
నే కోసిన పూల నంతు
మంత్రాలని తంత్రాలని
మతిపోయే పని నీయకు
ఓ పురాణచంద్రకళా!
యీలాగే చిరకాలము
నిలువుము నా సహచరివై
నీ పురాణహాసంతో
సుధతో నా క్షుధను బాపు
నూత్నచకోర మ్మేదియు నీ
హేమామృత సుప్రసాద
మాహరింపకుండు గాక

7

ఈ మందభాగ్యునకు నేవేళ మదిలోన
భాసించుచుండు హతభాగినీముఖము లే

ఈ విశాల జగాన నెంతగా వెదకినా
ఈ పాడు కందోయి కెవరు నచ్చ రదేమొ !

## 8

చావు మూడినవారు
చచ్చుచుందురు నూరు
సారులైనను గాని
ఈ పాడుపురుగు లె
న్నెన్ని చచ్చిన నరే
మరల నెన్నో వచ్చి
దొరలు మంటలలోన

## 9

సకలమ్మును మరచిన నా
స్వాంత మేలొకో నేడీ
చంద్రముఖిని మరువలేదు

## 10

గగనమ్మున తేలియాడ నెగుర వేసికొనిపోదురు
దేవలోకమునకు నిన్ను, నీ వెనుకనె కుంటినడక
ననుగమింతు నేనుకూడ, ఆ దూతల సిగలబట్టి
తలలు చితుకగొట్టివేయ తలపుబుట్టు నా మదిలో

ఎవరివశ మొనర్తును నా హృదయపద మ్మన్న తలపు
తలచి తలచి తలపుతోనె దాటిపోయినది కాలము
కుడివైపున దృష్టినిలుప నెడమకు వీగును ప్రాణము
ఎడమ ప్రక్క చూడబోవ కుడివైపునకే లాగును

**11**

విరహయామిని నెట్లు వేగింపగా గలవొ
చిరవియోగవ్యథాభరముచే శయ్యపై
దొరలుచును మన్మథుని దూషించెదవుగాక

**12**

అశ్రుశకటమునెక్కి యలివేణి పురబాల
కాశీపురీక్షేత్రగమనాభిలాషతో
సాగిపోనున్న యీ సాయంతనపువేళ
శ్యాలీత్రయీశాలి అక్షయుడు వరమాల్య
మే వరాంగన కాస యిచ్చి వరించునో
యేరీతి గడపునో యీ విరహమాసమ్ము
వచియింపు మో అమృతభాషిణీ దేవి!
పూవులే నా తరువు పూయుచుండునుగాని
ఫలము లేలా ఫలింపవొ యెరుంగుదు వీవు
పూయగానే తెచ్చి పొందుపరతును పూల
నన్నిటిని నీదు పాదాంభోజముల చెంత

## 13

జయరథ మధిరోహింపుము సాగింపుము విజయయాత్ర
విజయమాల లల్లి దిశల వీక్షింతుము నీకొరకై
పథధూళుల నూడ్చి శుభ్రవసనమ్ములు పరచియుంచి
వరియింతుము విజయముతో తిరిగివచ్చు వేళ నిన్ను
సజలదృగంచలములలో సంధింపుము హాసరేఖ
శూన్యగృహమ్మున వసంతశోభను నెలకొల్పి పొమ్మ
చీకటింట దీపశిఖను చెచ్చెర వెలిగించి పొమ్మ
రాత్రినొసట దిద్దిపొమ్మ రాకాశశితిలకమ్మును

## 14

ఎవ్వ రావలిదరికి చేరదలచినవారొ
రారండు వేగమే రండు రారండోయ్ !
వేచియుంటిని నదీతీరాన నావతో.
ఆవలి తీరాన
ఎన్నెన్ని యుపవనా లెన్నియాటలు పాట లెందరెందరు ప్రజలు
ఈవలి తీరాన
జలశూన్యవాలుకామయశుష్కమరుభూమి.
ఎంత తీరికయున్నదో చూడు డీవేళ !
నేడేల వృథసేయ ? రేపు వగవగనేల ?
రాదలంచినవారు రండు రారండోయి !

అస్తాచలము డాయనాయె దినకరుడు
మందమందములాయె మలయపవనములు
చీకటులు క్రమ్మెనా పడవ నడుపగరాదు
రాదలంచినవారు రండు వేవేగ !

**15**

పోనిమ్ము పోనిమ్ము పోవువారందరిని
పోబోకుమా నీవుమాత్ర మిటనుండి
ముగియనే లేదు వర్షాకాలగానమ్ము
మూసియున్నవి కుటీరముల ద్వారములెల్ల
నీరవనిశీథమున చీకటులు నిండినవి
చంచలములైనవి వనాంచలము లెల్ల
నిద్రగోల్పోయినవి వ్యాకులసమీరములు

**16**

దయామయీ ! చోరశిఖామణీ ! యెంత దయ నాపై
దయతో మాయాపాశము తగిలింపుము నాదు మెడను
దయతో నా శూన్యధనము నపహరించిపొమ్ము

**17**

సిరాధమనులను రక్తము చిందులాడ నల్లదిగో
పారుబోతు హృదయము తా పరుగుతీసి పోవుచుండ
వేగవేగ పరువులెత్తు వెనుకవెన్కగా భామిని

వాయువేగభరమున తన పైటచెంగు తేలియాడు
ముడిపీడిన శిరోజములు విడివిడిగా చెదరిపోవు
ఏమీ యీ ఆనందము! ఏమీ యీ నాట్యభంగి!
ఈ కురంగగామినీపలాయన మ్మిదేమి!

## 18

నీవే నా ధ్యానధనము
నీయెదలో సందడించు నిక్కము నగవులు వలపులు
వసంతమ్ము చేరవచ్చె వకుళప్రసవములు విచ్చె
పూవుటీరములను నిండె పున్నమిచందురుని నవ్వు
ఎందెందున వెదకిరేని పొందలేరు వారు నిన్ను
అంతరంగమందె యుందు వతిగుప్తస్వప్నముగా
కనుల కింత భ్రమనుగొల్పి చనియెద విదియేటి వరుస
బాష్పసలిలసేచనమున పరిశుద్ధము చేయరాదా
పరిమళములె కాని విరులసరు లెచ్చట కానరావు
అడుగుల సవ్వడులెగాని నడువ రెవరు దారిలోన
పూలన్నియు వాడిపోయి, కాలమెల్ల గడచిపోవ
అనాథయై దిక్కుమాలి యట్టె నిలిచె నా భవనము

## 19

బ్రతుకంతయు గడచిపోయె
అవలి తీరమ్ము జేర్చు
నావ అల్లదే! పిలువుము!

ఇచ్చిపుచ్చుకోళ్ళు గాగ—
లెక్కలెల్ల ముగియింపుము
అంధకారమున దీపము
వెలుగుట లే దనియా నే
నెంతపిలిచినా యులుకవు పలుకవు ?
సుఖమున దుఃఖమ్మున నా
యెదలో నీ మురళి మ్రోగు
నిన్నుజేరు దారి తెలియ
కున్నవారి నేడ్పింతువు !
నింగివైపు చూడ్కి నిలిపి
నిలిచియుందు నే నీయెడ
నాదు మనోవేదనచే
నాకృష్టుడవై వాకిలి
చెంత చేరగల వటంచు
అనుక్షణము నా యెదలో
ఆశ యెదో పొడముచుండు

## 20

రేయిగడచి పోకమునుపె
నీదు వలపు దీపికతో
దీపము వెలిగించిపో ప్రియా !

దారివెంట మునుముందుగ
దీప్తశిఖాధారిణివై

యెపుడు వత్తువా యటంచు
వేచియున్నవాడనో ప్రియా!

నిరవముగ నాయెడంద
తన చీకటి యింటిలోన
క్రమ్మగిపోవ నెంచునో ప్రియా!

రేయి గడచిపోకమును పె
నీదువలపు దీపికతో
దీపము వెలిగించిపో ప్రియా!

## 21

సావధానుండవై సాగిపోయే పథిక
మరచితివి నీదారి తిరిగిరావోయి!
తెరచిన కనుంగవకు దొరలు నశ్రువులతో
గ్రుడ్డితనమును తెచ్చుకొంటినిగదోయి

మరచిపోయిన దారిమధ్య పడిపోయినది
పోగొట్టుకొన్న నీ ముగ్ధహృదయాంబుజము
రాలిపడినది కంటకారామసీమలో
రాగారుణప్రసవరమ్యగుచ్ఛమ్ము

ఆ నదీతీరాన నన్నివేళలయందు
పెరిగి విరిగెడు క్రీడ వెలయుచునుండు

సావధానుండవై సాగిపోయే పథిక
మరచితివి నీదారి తిరిగిరావోయి !

## 22

ఏ శిలల దాకెనో యేమో హఠాత్తుగ
నా నావ యిట మునిగిపోనున్న దీ నాడు
క్రొంగ్రొత్త దీ నావ
తొలి ప్రయాణ మ్మిదే
ఈ యగాధజలమ్ము
తరియింపగా లేక
ఆటలాడు విధాన
ఆ తీర మీ తీర
మందుకొన నడయాడు

నా నావ యిట మునిగిపోనున్న దీనాడు.

సీలికెరటాలపై
తేలిపోయే పడవ
చుక్కాని చేబూని
యొక్కడనె యున్నాను
మలయమారుతములో
చలియించు తెరచాప
ఆకాశవీథి మేఘావృతము కాదు

ఆనందమయము నా అంతరంగమ్ము
ఈ నావ కుసుమితోద్యానమ్ము చెంత
చేరునను నాస నా చిత్తమ్ము విడదు
నా నావ యిట మునిగిపోనున్న దీనాడు

## 23

విరహవేదనతోడ మరణింతు ననుచు నే
ప్రతినబూనితిగదా ! బాహువుల బంధించి
వారించినా రెవరు మీరు ?
బాష్పాంబురాశిలో బడి మున్గిపోనెంచు
నన్నెవరు బంగారు నావలో నెక్కించి
తిన్నగా దరిజేర్చినారు ?

## 24

నికోసమె దారిలోన నిలిచియుంటి సుందరుడా
హృదయవీణ తంత్రులపై గదిసె ధూళి సుందరుడా
కుసుమమ్ములు లేక మాల గ్రుచ్చుటెట్లు సుందరుడా
తీగలపై దుఃఖగీతి మ్రోగు నదే సుందరుడా
దూరమ్మిననుండి యంధకారములో వినగల వది
దినము లొక్కటొకటె కడచిపోవునోయి సుందరుడా
యే పిపాస జనియించెనొ హృదయము తపియించిపోవు
ఏమిసేయ నోపుదు నిక నీ శూన్యపథమ్మినందు
కావిరంగు తెరచాపల నావ యెపుడు తిరిగివచ్చు
చేరుటెన్నడో సుధాబ్ధితీరమ్మిను సుందరుడా!

## 25

అలరులు ముడువక శిథిలమూర్ధజము
లందముగా ముడివేయుము సకియా !
కాటుక పూయని సజలనయనముల
గట్టిగ తట్టుము హృదయద్వారము
పైటచెరగుతో మరణజాలమును
పథికచరణముల బంధము వేయుము
వాదము సేయక మనోభీష్టమును
పదిలముగా సాధింపుము సకియా !

## 26

ఎందుకోయీ జలధితీరమున దినమెల్ల
యిసుకతో నూరకే యాటలాడేవు ?
సమయమ్ము మించిపోవక మునుపె నీ ఆట
చాలించి దూకుమీ సాగరమ్మందు
కడలిలోతులు వెదకి చిక్కినవి చేపట్టి
నవ్వేదో యేడ్చేదో నడచిపొ మ్మిలుజేర...
ఏ తలంపున వచ్చి యీ మార్గమధ్యమున
ఎవరు కూర్చొనినారో యేనెరుంగనుజాల
ఈ పూవుబొదరింట నీ పిల్లగాలిలో
నా యెడద నిర్లిప్తమైయున్న దీనాడు.
పోవలయునేని ఆ పొదరిల్లు చేరగా
జాగుసేయక నీవు సాగిపొ మ్మింక.

## 27

నాకర్మ మెట్లున్నదోగాని నే నెరుగ
సూర్యాతప మ్మనుచు చూచి భయపడబోను
చంద్రాతప మ్మంచు సహియింతుగాని

## 28

భ్రమతోడ దినమెల్ల భ్రాంతిమయ మైపోయె
భ్రాంతవాయువు లోలయ భ్రమయనెడు పూదీవ
పూలమంజరులతో పుష్పమయ మవుగాక
భ్రాంతిసాగరపరివ్యాప్తముగ నానంద
వీచికలు తీరాల వెల్లివిరియునుగాక.

## రా రా జు

### 1

తెరు తెరు తెరు తలుపులు తెరు
వాకిట నను నిలుపబోకు

ఎదీ యిటు నీదు చూపు
నా వైపున సారింపుము
పనులన్నియు తీరిపోయె
సందెచుక్క కాననాయె
వెలుగుపడవ కదలి కదలి
అస్తాంబుధి గ్రుంకిపోయె

నడచి నడచి యిలు చేరిన
నను వాకిట నిలుపబోకు

కలశము నిండార మధుర
జలముల గొనివచ్చితివా ?
శుభ్రదుకూలము దాలిచి
కురులు ముడిచి పూలు తురిమి
కోరకములు మాలలుగా
కూరిచి కొనితెచ్చితివా ?

గోవులు గోష్ఠముల జేరె
పులుగులు తమ గూండ్లు దూరె
ధారుణిపై సాగిపోవు
దారులెల్ల కలిసి యంధ
కారమ్మైన మాయమయ్యె.

నీ వాకిలి చేరిన నను
వెలుపలనే నిలుపబోకు

## 2

నన్ను కప్పియున్న మేలి
ముసుగును తొలగించు టనగ

ఎంతటిపని స్వామి ! నీ కెంతటి పని ?

నీవనుకోవలె గానీ
నిశ్వాస మ్మొకటి చాలు
నేల రాలిపోవు ముసుగు
నీ పిలిచిన పిలుపు వినక
కన్నుమూసి నేల వ్రాలి
యున్న నన్ను మేల్కొలుపక

వాకిటనే నిలిచియుందువా ? స్వామి ! యిదేటి వింత ?

రథచక్రధ్వనులు రేగ
జగతినెల్ల మేల్కొలుపుము

రాజరీవి దర్పముతో
నీ యింట ప్రవేశింపుము
నిదురమత్తు చెదరిపోవ
నీవే నా ప్రభు వటన్న
నిశ్చయమున వేగ వచ్చి
నీ చరణము లంటి, చేసి
కొనియెద నాత్మార్పణంబు.

3

చేరువగా దూరముగా
యెగిరిపోవుచున్న వవే
మెరుపుచూపుగములు
వనీవిహంగములు.

మ్రోగెనేని హృదయవీథి
ప్రేమవేణుగానరవము
గగనవిహారములు మాని
తమకు తామె తిరిగి వచ్చి
తలలు వంచి నిలిచిపోవు
మెరుపుచూపుగములు
వనీవిహంగములు.

హృదయకవాటమ్ము తెరిచి
వచ్చిపోవు వార లెవరొ

కనిపించుట లేదా మరి ?
కుసుమపరిమళములతో
గానముతో హాసముతో
చిరవసంతమే వెదకుచు
నిన్ను జేరవచ్చె, గాని
పరవశమున దూరముగా
యెగిరిపోవుచున్నవి, నీ
మెరుపుచూపుగములు
వనీవిహంగములు

## 4

దక్షిణద్వారమ్ము తెరచియున్నది నేడు
రావోయి రావోయి రావో వసంతా!
హృదయ ముయ్యాలగా నూపెదనుగానీ
రావోయి రావోయి రావోయి సఖుడా !

నవనవశ్యామసుందరరథ మ్మెక్కి
పొగడపూవుల దారులందున నడచి
కళవళింపగ చేయు మురళి పూరించి
బూరుగుపుప్పొళ్ళు మైనిండ నలది
రావోయి రావోయి రావో వసంతా!

వనమల్లికానికుంజమ్ముల న్నడచి
నవకిసాలయరమ్యపుంజమ్ము గడచి
రావోయి రావోయి రావో వసంతా !

మత్తిల్లి వీచు గాడ్పుల సీమలోన
అంటియంటని ఉత్తరీయాంచలమ్ము
ఆకాశవీధులం దల్లలనాడ
రావోయి రావోయి రావో వసంతా !

5

రూపప్రభ కన్నుల మిరుమిట్లుగొల్పు తావులలో
నీవలె మైమరచేవా రెవరయ్యా తాతయ్యా
శోభిల్లే రసికసభాసీమలలో
నీకన్నను రసికాగ్రణు లెవరయ్యా తాతయ్యా !

కలయికలూ కవుగిలింత లెక్కడనో
అక్కడ నీ వ్యాపారం
కలత లలుక లెచ్చటనో
నిలువవు నీ పదము లచట
మాయమర్మ మెరుగరాని తావులలో
నీకన్న నమాయకు లెవరయ్యా తాతయ్యా !

## 6

మారాజు రాజ్యాన అందరము రాజులమె
కాకున్న నతనితో కలసి యెటులుండేము
మా యిచ్చవచ్చిన రీతి సంచరించేము
అయిన ఆతని యిచ్చనే అనుసరించేము
మాకు దాసులౌ నరపతుల దాస్యమ్ముతోగాని
భయముతోగాని యే బంధనమ్ములు లేవు
కాకున్న నతనితో కలసి యెటులుండేము
మమ్మందరను గౌరవించు మారాజు
అయిన ఆ గౌరవమ్మెల్ల అతనికే చేరు
ఏ అసత్యముతోడ నెవ్వరుగాని
ఊరకే మము కించపరచగాబోరు
కాకున్న నతనితో కలసి యెటులుంటేము
మాదారిబడి పోదు మందరము మేము
అయిన ఆతని దారినే కలసిపోయేము
వైఫల్య మనియెడి సుడిగుండమందు
పడి యెన్నడును మేము నశియింపబోము
కాకున్న నతనితో కలసి యెటులుండేము
మారాజు రాజ్యాన అందరము రాజులమె.

## 7

ప్రాణపురుషుడు నాదు ప్రాణపదమున నిల్చియుండు
అందుకే యెల్లెడల నతడు కన్పించు

కనుపాపలో చూపుమేరలో కదలాడు నతడు
ఆవంక నీవంక నందుకే కన్పించు.
అతని నోటిమా టాలకింపగ నెంచి
వాడవాడలలోన తిరుగాడితినిగాని
వెదకినా ఆ మాట వినిపించనేలేదు
వెనుదిరిగి మరల నా యిలు చేరితినొ లేదొ
ఆమాట నా పాటలోననే మ్రోగినది.
యాచించి యింటింట నతని నన్వేషించు
జనులార ! మీకు కానగరాడు కనరాడు
నా హృదయపదమందు నా కన్నుదోయిలో
చూడ్కి నిల్పితిరేని అతడు కన్పించు

## 8

ఏమయినా మరి యెవరేమన్నా
కాంచనహరిణము కావలెనన్నా
చపలచరణ జనమనోహరణచణ
కాంచనహరిణము కావలెనన్నా

కాంచనహరిణము ఖద్యోతమువలె
చూపుల కందక దాపున నిలువక
పట్టబోవగా పలాయన మ్మయి
కన్నుచెదర వడిగా నడయాడును.

కైవసమయినా కాకపోయినా
దాని దారినే తరలిపోవుదును
నాయంతటనే నానాస్థలముల
నెటకెటకో పరువెత్తిపోవుదును.

సంతనుదొరికే సరకులనే కొని
యింట దాచుకొనరే మీరందరు
దొరకని సరుకుల పరీమళములే
యేల మెదలు నాయెద లోలోపల

ఉన్నదంతయును ఊడ్చి యొరుల కిడి
లేనిదానితో నానందింతును
పోయెనంచు వాపోవుచుంటినని
అందరు మీ రనుకొందురో యేమో

నగువెోమున నానందము చిందగ
నిర్విచారముగ నే జీవింతును

## 9

కమలముకుళదళములు ప్రీలె నవే
గాలిం దేలె నవే
మానససరసిని రసప్లుతములై
త్రుటిలో తరగలు తూలె నవే
నింగి మునింగెను పరీమళమ్మున

అనిలము మూర్ఛిలె నానందమ్మున
ఝుంఝుమ్మని తుమ్మెద రొదచేసెను
నిఖిలభువనముల మనములు సోలె నవే
మనములు సోలె నవే

## 10

లేదురా మనకేమి లేదురా పదరా
ఇంటబైటా మనము పాడుకొందమురా
ఎన్నాళ్ళు గడచినా యేమాయె పదరా
హాయిహాయిగ మనము పాడుకొందముర
లేదురా మనకేమి లేదురా పదరా
పైడియిసుకలపైన భవనాలు నిర్మించు
వారి యెదురుగ నిల్చి పాడుకొందమురా
లేదురా మనకేమి లేదురా పదరా
జేబుదొంగలు మనల చేరగా రాగానె
ఉత్తజేబులు చూపి పాడుకొందమురా
లేదురా మనకేమి లేదురా పదరా
ముసలితొత్తైన ఆ మృత్యువే వచ్చెనా
దానిపై చిటికేసి పాడుకొందమురా
లేదురా మనకేమి లేదురా పదరా
అదె వసంతుడు వచ్చె ఋతురాజు నేడు
ఉజ్వలమ్మైన వేషము మేన దాల్చి
పైన వేషమెకాని లోన భిక్షుకుడె
లేదురా మనకేమి లేదురా పదరా

## 11

నా యెదలోపల నిత్యము నృత్యము
చేయున దెవ్వరురా
తోడై మృదువుగ మృదంగమున మ్రో
గించే దెవ్వరురా
తాతా థైధై తాతా ధైథై
నగవుల రవ్వలు అశ్రుమరకతము
లాందోళింపగ వదనబింబమున
తాళతాళమున మందమందముగ
తోడుతోడుగా జననమరణములు
నృత్యము చేయునురా
తాతా థైథై తాతా ధైథై
ఏమానందము ఏమానందము
ముక్తి యొకట భవబంధ మ్మొకయెడ
దివారాత్రములు నాట్యము సేయగ
దిగ్దిగంతములు తరంగితములై
పండువు సేయునురా

## 12

కాదు వసంత మ్మనగా కేవలకుసుమితసుమముల లీల
కనబడలేదా రాలే ఆకుల రాలే పూవుల ఖేల
పొంగే అలలో క్రుంగు తరంగపు
సంగీతము వినరాదా

కడలిని గలిసిన యలల సవ్వడులె వినిపించెడు నేవేళ
ఈ వసంతసమయమ్మున గను మదె రాలిన పూవుల ఖేల
మాణిక్యములే యనగా నేల
నా ప్రభుపాదయుగమ్ముల మ్రోల
నానాభూముల మృచ్ఛకలమ్ములు మిళితములైనవి చాల
సాగింతురు నా గురుచరణాంబుజముల కడ
జ్ఞానులు కొందరు తమతమ మనుగడ
ఎక్కువగా అజ్ఞానులపై అభిమాన మ్మిక్కడ
అందుకోసమే శిష్యుడనైతిని గురుపును విడువగ జాల

## 13

ఈ మధురయామినీవేళ
విరహమే మధురమైనదిరా
విరహవేదనలో గభీర
రాగ మొక్కటి మ్రోగినదిరా
నేటి పున్నమరేయి నిండి
కాతరమ్మయి కానరాని
తృష్ణయేదో నిండినదిరా
ఏ చంచలమరీచికలను
కందోయి యెదుట నిల్పినదిరా
ఏ సుదూరసుగంధరాశి
వాయువథమున దారితప్పి
నా యెదను మాయమైనదిరా

స్వరరాగతాళములతోడ
నేవాణి చివురుజొంపముల
గుసగుసలు వోవునో అదియె
నా కాలి యందియల రవళి
గూడి తోడుగ మ్రోగినదిరా

## 14

తెల్లనివి నల్లనివి యెల్ల
నీ రాగమహిమమ్ముచేత
రంజితములై పోయెనోయి
అరుణారుణములైన నీదు
చరణములవలె నాయెనోయి
శయనములు స్వప్నములు వేష
భూష లరుణము లాయెనోయి
కెందమ్మివోలె నా యెడద
కళవళమ్మయి పోయెనోయి

## 15

నాయాట నీతోడనే నేడు సఖుడా
వ్యాకులమ్మైన నా హృదయ మేవేళ
నోటువోవుట యన్న మాటయే లేదు
ఒక్కాము పయి చల్లి తప్పికొన నెంతువా ?
నా సరస మనసారగా మనోనాథ

నిలిచి నా హృత్కమలరేణువు కొంత
నీపైని చిల్కగా నియవా సఖుడా !

## 16

ఉన్నదంతయును మూటగట్టుకొని
సర్వనాశమే ఆకాంక్షించుచు
వేచియుంటి నిట
ఇంటినుండి ఘంటాపథమునబడి
యెవరు వత్తురాయని చూచుచు నే
వేచియుంటి నిట

## 17

తా కనుపించక కాంచు నిన్నతడు
కానరాక ప్రేమించుచుండు నిను
గోపన మాతని ప్రేమరహస్యము
చూరగొనియె నా హృదయపదమ్మును

## 18

నీతోడ నృత్యమ్ము సేయగా
పారవశ్య మ్మావరించినది నన్ను
నీ తాళగతినంది నా పదమ్ములు నడచు
ఎవ్వ రేమనుకొన్న నా చెవిని బడదు

నీ పాట వినగానె నా హృదయమందు
ఉన్మాద మెదియొ మేల్కొనును
నా భజనసాధనలు వేషాభిమానములు
తెగి నేల జారిపడిపోవు
నాట్యవేగముతోడ హృదయ మాందోళింప
తలపోతలే చెరిగిపోవు

## 19

ఏ కుంజవనములో ఏ నిభృతవీథిలో
ఏ గహనసీమలో పూలు పుష్పించునో
ఏ నిభృతభూమిలో ఏ గహనసీమలో
సౌరభమ్ములు మోసి సంచారములు సేయు
వ్యాకులమ్మగు దక్షిణానిలము వీచునో
బైట పాటలుపాడు దాసరులతోబాటు
క్లాంతమైన వసంతయామిని గతించినది
ఉత్సవపు రాజెడనున్నాడొ ? యేమేమి
కొనిపోవుచున్నాడొ తన గృహాంగణమునకు

## 20

ప్రేమచే విస్మయము పుట్టింతుగాని
రూపవైభవముచే మురిపింపబోను
పాటతో వాకిళ్ళు తెరిపించుటేగాని
చేతితో ద్వారమ్ము తెరువగాబోను

అనురాగమాల నీమెడను వేయుటెగాని
బరువైన భూషణమ్ములు పూలదండలును
నా మేన ధరియించి తిరుగాడగాబోను
ఏ గాలివానలో ఏ అలలులేచి మది
నాట్యమ్ము సేయునో యెవ్వారెరుంగుదురు
కనరాని యాకర్షణమ్ముతో శశివోలె
హృదయాబ్ధిపై తరంగమ్ములే లేపుదును

## 21

ఒక్క వ్రేటుతో నున్మూలింపుము
నా భయమెల్ల భయానకమూర్తీ
కఠినుడవై నా హృదయము నీ పద
యుగమున నానతముగ నొనరింపుము
నిత్యకృత్యముల ముంచియుంచి నా
ఇంటి చుట్టురా గోడకట్టితివి
విధియించితి వీ వేషభూషలను
రారమ్మాకస్మికసాక్షాత్కృతి
దిగ్దిగంతమ్ముల నావరించి నా
జీవన మొక్క నిమేషములోపల
ముక్తమార్గమున పోవని మ్మొగిరి
అంతట నీ దరహాసమూర్తియును
అభయ ముదారమ్మగు నీ రూపము

సనాతనమ్మయి శాంతిమయమ్మయి
సాక్షాత్కారం బయ్యెడు గావుత

## 22

నీ ప్రేమమహిమాతిశయముచేతనె నేను
సకలకలంకభాగస్వామి నైనాను
అన్ని యపరాధాలు అపరాధినౌ నావె
        నీదారిలోనున్న కంటకమ్ముల నేరి
        నేలపై నీవు విశ్రాంతి గైకొను చోట
        నాలోన నీ రాగ మనురాగమై వెలయ
        పరచియుంచెదను నా యుత్తరీయాంచలము.
శుభ్రాసనము వెంట పదిల మ్మొనర్చుకొని
నియతిమై యందందు తిరుగుదానను గాను
        పాదమ్ము లెందేని పంకిలము లయ్యెనా
        ఆ పంక మెదపైన హత్తుకొన గోరుదును.

## 23

నీ చరణదాసినై నేనెట్లు పలుకుదు
        నిన్ను ప్రేమించితి నన్నమాట
నాలోన నేదే గుణ మ్ముండెనా యది
        భవదనంతస్నేహఫలము గాదె
మూల్యమే లేక యమ్ముడువోవ దగుదాన
        చేరి శ్రీపదసేవ సేయుదాన.

## 24

నీ అగాధాంధకారములోన
అంతమొందింపు మీ యంధకారమ్మెల్ల
అంధకారస్వామి !

రా దుర్గమాకృతీ ! గంభీరమూర్తీ !
నా జీవనమ్మందు, నా హృదయపథమందు
రారమ్మ దిగిరమ్మ
అంధకారస్వామి !

ఈ మనోదేహమ్ము లేకమై పోనిమ్ము
లేనివై పోనిమ్ము
అంధకారస్వామి !

నా పురాసంస్మృతులు కోర్కెలు వికారములు
నీ చరణముల చెంత నిలిచిపోపగనిమ్ము :
నిర్వాసితను నేను దుర్వాసనాసూత్రబద్ధ నో
యంధకారస్వామి !

వేయిబంధములతో నీయందు బంధింపు
మోయి ! యీలాటి బంధనములే కామింతు
నంధకారస్వామి !

## 25

ఈ వసంత వేళయందు
కుంఠిత మవగుంఠితమగు
నీ జీవితపథములోన
వంచన మొనరింపబోకు.
        హృదయాబ్జము విరియనిమ్ము
        నే ననుచును పరు లనుచును
        భేదబుద్ధి మరచిపొమ్ము
గానామృతభరితగగన
సీమతోడ వియ్యమంది
బహిర్జగతి దశదిశలను
విస్మరించి, వెల్లువగా
మధురభావ మొలికింపుము.
        చివురుచివురునందు నేడు
        వనమున వేదనలు మ్రోగె
        దూరసీమ నెవరి గోరి
        వసుంధరాదేవి నేడు
        సజ్జితయై నిలుచునాకో
నాదు ప్రాణమందిరమున
దక్షిణానిల మ్మెవరిని
తలుపుతట్టి పిలుచునాకో

పరిమళములు కళవళించు
ఈ నిశి యెవ్వరి పదముల
మ్రోల నేల వ్రాలునొకో
సుందర వల్లభ మూర్తీ
యెవరికి నీ యాహ్వానము

**26**

ఈ యిరుల పొరలలో రెండుచేతులు సాచి
నన్ను చేపట్టితివి నాథా
మెల్లమెల్లని నడల నేవేళ నా దరికి
వేంచేసితివి మనోనాథా
జీవనస్వామి నీ యెరుక యేమరచి నిను
కోల్పోతి ననుకొంటి నాథా
నీవుమాత్రము నన్ను కోల్పోవ నేరవని
యీ రేయి గనుగొంటి నాథా
ఏ నిశీథిని నేను వెలుగు నార్పితినో
ఆ నిశీథిని నీవు ధ్రువతారవై నిల్చి
జ్వలియింతు వో మనోనాథా
నీతోడ చరియింప నేనాడు మానితినొ
ఆనాటినుండియును నాదారి వెంటనే
డాగియుందువు నీవు నాథా

## 27

రేయి గడచె ప్రొద్దు పొడిచె
నాదు ప్రయాణమ్ము ముగిసె
        అదుగదుగో వినిపించెడు
        తీయనైన వెలుగుపాట
ధన్యుడవో యాత్రికుడా!
జాగరమున నలసె రజని
ధన్యమయ్యె నీనాటికి
ధూళిధూసరితహృదయము
        అటవీపర్యంకమందు
        సమీరణము మేల్కొనియెను
        ప్రతికుంజద్వారమ్మున
        తేనెలకై మూగె తేంట్లు
నీ ప్రయాణ మంతమయ్యె
తుడిచికొమ్ము కంటినీరు
        తొలగెను లజ్జాభయములు
        అహంకార మంతరించె

# ము క్త ధా ర

## 1

తిరిగిరాడు తిరిగిరాడు
మరల నతడు తిరిగిరాడు
గాలివాన కెదురెదురుగ
తేలిపోయె నావ ఇంక
తిరిగిరాదు తీరమునకు
వెనుకద్రోసి వగపులెల్ల
వెఱ్ఱివా డెవండు వాని
నీదు బాహుబంధనమున
నిలుపలేవు నీ వతనిని
తిరిగిరాడు తిరిగిరాడు
మరల నతడు తిరిగిరాడు

## 2

భయము పోగొట్టు నా పడవ నధిరోహించి
ప్రళయఝంఝూసమీరమున కెదురుగ, మరణ
వారాశి తరియించువాడ నవలీలగా
'భయపడకు'మను దివ్యవాణిని నమ్మి, నా

పడవ పీలికలైన పాత్ర తెరచాపతో
వడివడిగ చేరు నావలి తీరమందు క
న్పడెను ఛాయాద్రుమప్రాంతవాటికను
నన్నేలు నాతడే నాత్రోవ చూపించు
నాకేల భయమింక నావ నిచటనె యుంచి
నాదారి పోవుటే నాకు కర్తవ్యమ్ము

## 3

పడనిమ్ము ! పడనిమ్ము ! ప్రభు ! నీ ప్రహారముల
పడనిమ్ము నాపైన వడిగా మరల మరల
ఏ మూలనో దాగి యెచటనో పరువెత్తి
భీతితో నిన్ను తప్పించుకొని తిరుగు నా
సర్వస్వమును కైవసము చేసికొనుచు
సర్వంకషముగ నను సరిదిద్దుకొనుము
నీవో నేనో యోడిపోవలయునో ప్రభూ !
తిరునాళ్ళ సందడుల తీర్థస్థలాలలో
నవ్వుసవ్వడులతో నా బ్రతుకు కడచినది
నేడెట్లు నన్ను నీ వేడిపింపగ గలవో ?
నీ సింహపీఠిపై నీచెంతనే మమ్ము
కూర్చుండబెట్టుకొను కోర్కెతో గొంతెత్తి
పేరుపేరున నీవు పిలిచెదవుగాని మరి
మాటిమాటి కదేమొ మరతు మామాట ప్రభు
తా నెరుంగడు మమ్ము ద్వారపాలకు డతడు

దారి నడుమనె మమ్ము వారించు తరలించు
వెలుపలను వాకిటనె నిలిచియున్నామయ్య
పిలిచికొని పొమ్ము లోపలికి మమ్మో ప్రభూ!
ప్రాణమును దానితోబాటు మానధనమ్ము
మాకిచ్చితివి దయామయుడవై లోకేశ!
మ్లానమై మలినమై యానాటి కానాడు
మట్టిలో కలిసినది మానధనమంతయును
లోభమున దగిలి లజ్జాభయమ్ముల చిక్కి

4

ఇదియేమి యున్మాద మీ అస్తమయవేళ!
ఏ మందపవనమ్ము లీ మోహనస్వరము
నాకాశవీథిపర్యంతమ్ము నింపెనో
ఏమి యున్మాద మిది యీ అస్తమయవేళ
పిలుపొకటి వినిపించు వీనులకు విందుగా
పిలుచు నాతండె కన్నుల గానగారాడు.
గిరులపై వనులలో తిరిగి వేసారితిని
గాసిలి నిరాశతో కనలి విలపించితిని.

5

నీ శృంఖలమ్ములు నన్ను శిక్షింపగాలేవు
నీ ఆఘాతములు ప్రాణ మపహరింపగలేవు
తనచేతితో ముక్తిదానపత్ర మొసంగె

అది నా హృదంతర మ్మందె యున్నదిగాన
నీ బంధనమ్ము బంధింపజాలదు నన్ను
ఏత్రోవ వత్తునో యేత్రోవ బోదునో
నిజమెరుంగగ గలరె నీ తలారులు వెదకి ?
ప్రభుమందిరద్వారవర్తినౌ నన్నెవరు
వారింపగలరు నీ ద్వారమ్ము చొరనీక ?
ఎంత భయపెట్టినను సుంతయు భయంపడను

## 6

సోదరా వైశ్వానరా !
పాడెదను నీ విజయగాధ !
సకలశృంఖలములను సమయింపగా గల్గి
అరుణారుణమ్ముగా మెరయు నీ మూర్తితో
సరివచ్చు మూర్తి యెచ్చటను గానగరాడు
ఏ పాటతో నీదు హృదయ ముప్పొంగెనో
చేదోయితో నింగి చెరగు లాడించేవు
భయరహిత మానందమయమైన నృత్యమిది
వర్ణింపగారాదు భళి ! యేటి నృత్యమో !
భవబంధమోచనప్రాప్తి గల్గిన నాడు
ఖైదు తలుపులకున్న గడియలు తొలగిపోవు
కరచరణరజ్జువులు కాలి బూడిదయౌను
నా దేహ మానాడు నీ దేహమున జేరి
నవనవారుణముగా నాట్యమ్ము సేయు

దాహమ్ములెల్ల నీ దాహమున దగ్ధమై
ఆనాడె అశుభమ్ము లన్నియును నశియించు

## 7

ఓ మధురగాయనమణీ! గుణీ!
తంత్రులను సరిచేసినంత నీ
పని తీరిపోవునా ?
శ్రుతిచేసికొన్న వీణావాద్య
మిట్టులే పడియుండునా ?
నీ కరాంగుళులు సోకకయున్న
సుస్వరము మేలుకొనునా ?
లజ్జాభరమున తీగల తూగి
రాగమ్ము మూగవోదా ?
ఓ మధురగాయనమణీ! గుణీ!

## 8

నేలపై పారవైచినయంత మాత్రాన
నిలుచునా అది అచటనే? ఓ బుద్ధిహీనుడా!
ఎవడో ఒకడు దాని వెల యెరింగినవాడు
ఎత్తుకొని పోకుండునా ? ఓ బుద్ధిహీనుడా!
అదె చూడు రత్నమును! మృత్తికకు దానిపై
హక్కుగలదని యందువా ?

ఈ రత్నమే పోయెనేని యా ప్రభుకంఠ
హారమే వృథయౌను గాదా
రత్న మన్వేషించు దూతలరుగో ! వారి
రాకపోకల చూడలేవా ?
అవహేల నెంతగా సలిపినను ప్రభువునకు
ఆదరమ్మే హెచ్చిపోదా ?
వ్యథపెట్టు మానవుల వ్యథలన్నిటిని మోయు
ప్రభువు తా సహియించి యూరుకొనునా ?

## 9

మ్రోగినది మ్రోగినది మ్రోగినది డమరు, నా
హృదయమందున మ్రోగినది డమరు నేడు
నా ప్రాణములలోన నర్తించు నీనాడు
ప్రభుమనోహరపాదపంకేరుహద్వయము
యామములతోబాటు యామికులు మేల్కొనిరి
ఆకాశమున తార లల్లాడగా సాగె
ప్రాణపదముల నెల్ల వ్యథ లావరించినవి
బంధనమ్ములు పటాపంచలై పోయినవి

# రక్తకరవీరం

## 1

రావోయి లేచి రావోయీ
పిలిచేను పిలిచేనదే పౌష్యలక్ష్మి ॥రావోయి॥
తట్టనిండగ పసిడి ధాన్యాలు నింపుకొని
పిలిచే నదే లేచి రావోయీ ॥రావోయి॥
దిక్సుందరులు కమ్మతెమ్మెరల కైపుతో
పండిన పొలాలలోపల నాట్యమాడేరు
నేల చెరగులరాలె నిండుటెండ పసిండి ॥రావోయి॥
నేల పాడేపాట నింగి విని మురిసినది
ఇంట నే డెవ రుండగలరోయి ॥రావోయి॥
వెలుగుజల్లుల పొంగు విప్పారి విలసిల్లు
మంచుతుంపర లందగించు వరికంకులను
మోయలేని ముదంబు పుడమితల్లి వెలార్చు ॥రావోయి॥

## 2

నా స్వప్నతరణి నడిపించే నావికా !
నీ వెవ్వరు నావికా నీ వెవ్వరు ?
తెరచాపలు నిండిపోయె
మత్తిల్లిన గాడ్పులతో ॥నా స్వప్న॥

పాడిపాడి సాగిపోవు
పరవశమై నా ప్రాణము
నావ నీట తేలియాడ
నన్నె నేను మరచిపోవ
ఆ సుదూరతీరమ్మున
కటులె సాగిపోవోయీ ॥నా స్వప్న॥
విన్నవోవు నా తలపుల
ఉన్నటులే ఉండనిమ్ము
నీ ముంగలి తెరను దీసి
నా మో మొకసారి చూడు
మందస్మితకాంతితోడ
అందగింపు మీ ప్రాణము ॥నా స్వప్న॥

3

ఇంకిపోయె అమృతధార
యీ చీకటి బ్రతుకులోన
ఇంక మృత్యురసముతోడ
నింపివేయు మీ పాత్రిక
ఈ చితాగ్నిపై రేగిన
యీ జ్వాలానవమాలిక
జ్వలనవలయ మంతటినీ
సమయించే మహాజ్వాల !
శూన్యగగన మంతటికీ
శోభ తెచ్చు మహాజ్వాల !

## 4

నీ దినమణి పెనుమబ్బుల
నీలిమలో మాయమాయె
దినమంతయు పనికిరాని
పనులతో నశించిపోయె
రానిమ్మా తిమిరరాత్రి
లుప్తనిశాచరమ నళిని !
క్లాంతనయనయుగళిని ది
గ్బ్రాంతిగొలుపు నుషఃకాంతి
కప్పివేయనిమ్మాయీ !

## 5

నా పాట నీకు వినిపింపగ
మేలుకొల్పి నన్ను నిలుపు
ఓ నిదుర చెదరగొట్టుదాన !
నా యెదకదిల్చి యిమ్ము పిలుపు
ఓ వగపు మేలుకొల్పుదాన !
ఇరు లవివో విరియబారె
పులుగులు తమ గూండ్లు దూరె
పడవ యేటియొడ్డు చేరె
నా హృదయమొకటి యూరట కనలేమి తెలుపు
ఓ వగపు మేలుకొలుపుదాన !

నా పనిపాటుల మధ్యమధ్య
కారిన కన్నీళుల ఝురి
ఆపనైనలేదే మరి ?
మెలమెల్లగ నన్నుడాసి
నాలో నమృతమ్ము పోసి
పోలేదా నన్నుబాసి ?
నా వగపుల మాటుమణిగి నిలిచియుంట ప్రీతిగొలుపు
ఓ వగపుగొల్పుదాన!

## 6

వరదవారి కంటినీరు
వగపు కడలి కలిసిపోయె
ఓ నా చిన్నారీ! నా చిన్నారీ!
రెండుగట్టు లొరసికొనుచు
నిండిపోయె గుసగుసలు
ఓ నా చిన్నారీ! నా చిన్నారీ!
ఎరిగిన తీరాన నాదు
తరణి నిలిచియుండె దాని
కట్లన్నీ విడివడి పెను
గాలిలోన తేలిపోవ
యెరుగని యే గట్టునకో
యెవరోహో తరలించిరి ?
ఓ నా చిన్నారీ! నా చిన్నారీ!

## 7

వలపుగొంటి వలపుగొంటి
ననుచు కలరుతమ్ముతోడ
చేరువగా దూరముగా
నేలపైన నింగిపైన
వినిపించును వేణురవము ॥వలపు॥
నిండారెడు వగపున ఏ
గుండె క్రేళ్ళువారెనో
నింగికొనల ఏ నల్లని
నేత్రాంచల మంటి, కంటి
నీరు జాలువారెనో ॥వలపు॥
ఆ కలకంఠమ్ముతోడ
మహాసాగరతీరమున
కట్టుతెగిన గంభీరా
క్రందనమ్ము పొంగిపొరలు
మరపుగొలుపు పాటమ్రోత
అకారణముగా మదిలో
అదే పనిగ కళవళించు ॥వలపు॥

## 8

యుగయుగాలుగా నన్నే
కోరియుండె కాబోలును
నే నడిచే దారిచెంత
నిలిచియుండెనో యేమో ॥యుగ॥

ఏనాడో సాంధ్యవేళ
మసకమసక వెలుతురులో
కనుగొనల నే నాతని
కాంచియుంటి ననిపించును
నే నడిచే దారిచెంత
నిలిచియుండెనో యేమో ॥యుగ॥
వెలుగు జిలుగు పాటలతో
నేడే జాబిలి నివాళి
మేలిముసుగు వీడిపోయె
నీలనిశాముఖమునుండి
వెన్నెల వెలుగున నాతడు
కనులయెదుట కనిపించగ
తెరలన్నియు చిటికలోన
సురిగి మాయమై పోవును
నే నడిచే దారిచెంత
నిలిచియుండెనో యేమో ॥యుగ॥

**9**

తుదకు మిగిలిన పంట
మొదలంటగా కోసి
మోపులను గట్టిగా కట్టండీ
చేర్చుకొని పోవగా
చేతికందని పంట

అబ్బూరి రామకృష్ణరావు

మట్టిలో మట్టిగా
మణిగిపోగా వదలిపెట్టండీ

## 1

మానవేంద్రనాథరాయి మరణించిననాటి రాత్రి
ఖితిలి పచ్చికమేయని గోవులవలె నిక్కిచూచె
వేయికనులు. మానవతామహితమహాభూతధాత్రి
కళవళించె మందగతిని కమ్మని తెమ్మెరలు వీచె

దైవభక్తి దేశభక్తి వికటంగా విస్తరించి
అసత్యాన్ని పూజించే తరుణంలో లేచినిలిచి
హేతువు సేతువుగా భవపారావారము తరించి
పయనించే త్రోవకు జిజ్ఞాసువులను చేరబిలిచి

అసంఖ్యేయభారతీయమనోమందిరాల నిలిపె
విజ్ఞానప్రదీపాన్ని నవమానవతాజ్యోతిని
కదిలించే రచనలతో ఆలోచన మేలుకొలిపె
పంచిపెట్టె శ్రమించి తా నార్జించిన అనుభూతిని

మహామతీ ! మానవేంద్ర ! నీ చరిత మజరామరము
నీ అనుయాయులె నీవై సాగింతురు నీ సమరము

1966

## 2

మరణం పిలిచింది నన్ను నానావిధభాషలతో
తరుణం రాలేదని నే నిరసించా నాపిలుపులు
అయినా అరమర లేదని అరచిం దది ఘోషలతో
జయనాదం చేయకు మరి తెరిచే ఉన్నవి తలుపులు

అనుదినమూ క్షణక్షణం మరణించే నాకోసం
అనుక్షణం ప్రతిదినమూ జీవించే నన్ను చేరి
ఏలా ఈ అసంబద్ధహాస్యాస్పద పరిహాసం ?
లీలామానవుడ నేను నిలుపుము నీ విజయభేరి

తిరిగితిరిగి మతి చలించి తిరిపెమెత్తు నీ రుతి లో
అరచిఅరచి విరిగిన నీ ఆహ్వానము చాలింపుము
రామణీయకమ్ము చిమ్ము నీ ఎదలో నీ గతిలో
తమకమ్ములు గుబాళించు తరుణమ్ముల పాలింపుము

మరణం మరణించిం దను మాయమాట రానీయకు ।
నీ హతకుడ నేనేనను నిందను నాపై వేయకు ।

1966

## 3

అరవై సంవత్సరాల అరుణారుణవయోరేఖ
తలదాల్చిన చిరంజీవి శ్రీరంగం శ్రీనివాస
రావును దీవించువేళ వ్రాయించిన సుహృల్లేఖ
"పరాధీనకారాగతపతితుల స్వేచ్ఛాపిపాస

తీరలేదు; అన్నార్తుల కన్నులతడి యారలేదు
లోకంలో ధనమదాంధకాపురుషుల దుర్ణయాలు
తెరలువిప్పి కన్నుగప్పి ఏదితీపి ఏదిచేదు
ఏదీ కర్తవ్యమ్మని చేయదగిన నిర్ణయాలు

చేయనీక పాలించే ముష్కరచేష్టావ్యూహం
ఛేదించక యశశ్శయ్య శుచివై శయనించేవా ?
నీ కలాన్ని ఖడ్గంగా అలముకొన్న వ్యామోహం
విదిలిస్తూ పదిలంగా కృతివై పయనించేవా ?

ఏటేటా పాటలలో సౌందర్యం పోగుచేసి
తెలుగునాట నిలిపేవా శ్రమజీవుల *వారణాసి ?"

1969

*వారణ + అసి

## 4

నిజమే నిన్నెన్నిసార్లు పేరుపెట్టి పిలిచానో
నీకోసం పరితపించి నిట్టూర్పులు విడిచానో
ఎన్నిసార్లు తెరచాటున నీ వాకిట నిలిచానో
నిరాశతో ఒంటరినై బ్రతుకుబాట నడిచానో

నా జీవనమందిరాన వెలుగదు నీ దీపమనీ
నీ చరణాంబుజపరాగరేణువులే రాలవనీ
నా తలపుల సందడిలో నిలువదు నీ రూపమనీ
నా నుడువుల సవ్వడిలో నీవు నిలువజాలవనీ

రహోవార్త లందించే రక్కసి తాత్వికుల బోధ
వినీవినని వేడుకతో పరిణతాత్మచింత మాని
ఈ జీవిక వ్యర్థశ్రమ నిరర్థకవిషాదగాథ
ఈ మనుగడ నిరాధార మని అనుకొన్నానుగాని

వెనుదిరిగి విలోకిస్తే కనిపించిం దొక సత్యం
జీవించిన ప్రతిక్షణం పూర్ణ మక్షరం నిత్యం

1970

## 5

ఏనాడో రావలసిం దీ వారణపురికి మనం
ఆ విశాలవటవృక్షం నిశ్చలనిభృతాగారం
ఇంకా నిలిచే ఉన్నది. నాడు మనకు చిన్నతనం
అల్లదుగో ! స్వర్ణశిఖరదేవమందిరద్వారం

నిన్నూ నన్నూ ఎరుగరు నేటి కొత్తపూజారులు
పరిచిత కంఠస్వరాలు చెవులకు పండుగ చేయవు
అటూ ఇటూ నిర్మించిన కొత్తకొత్త రహదారులు
ఆ వెనకటి సుధాస్మృతులు వేరొక రుతి వినసీయవు

అసంబద్ధయశోవాంఛ పరచింతాపరాఙ్ముఖత
ప్రబలే ఈ నగరంలో ఏమున్నది తుదకు ఫలం ?
అంతులేని ధనపిపాస అనాగరకనాగరకత
ఈ రొదలో ఎలా మనం మనుగడ సాగించగలం ?

గతం గడిచిపోయిందని ఏలా ఈ అనుతాపం ?
కాలం నర్తకి బహుశా మారుస్తున్నది రూపం !

1970